# సరస్వతీ బుక్ డిపో. బెజవాడ.

## స్టేజీ నాటకములు

| ఒక్కొక్కటి ధర | | రు. అ. |
|---|---|---|
| శ్రీకృష్ణ తులాభారం, | ము.సు. | 1-8 |
| భక్తమార్కండేయ, | డిటో | 1-0 |
| కచదేవయాని | డిటో | 1-0 |
| సత్యహరిశ్చంద్రీయం | బ. ల. | 1-8 |
| బుద్ధిమతీ విలాసం, (శ్రీయాళ్) | | 1-4 |
| సాత్రాజితీయము | బ. ల. | 1-0 |
| ఉత్తరరాఘవము | డిటో | 1-4 |
| రామదాసు | ధ. గో. | 1-8 |
| రామకబీర్ | డిటో | 1-4 |
| సుభద్రార్జునీయము | డిటో | 1-4 |
| సావిత్రి | శ్రీ. స. | 1-8 |
| కనక్తారా | చం. కే. | 1-4 |
| బలిబంధనము | డిటో | 1-2 |
| శివలీల | ము. వేం. | 1-0 |
| తులసీదేవి (సతీతులసి) | | 1-4 |
| ద్రౌపదీవస్త్రాపహరణం | మ అ. | 1-8 |
| కృష్ణలీల (క్రొత్తపాటలు) | డిటో | 1-0 |
| వీరాభిమన్యు | ఊ. స. | 1-0 |
| పాషాణి (అహల్య) | డిటో | 0-12 |
| కృష్ణలీల బళ్ళారి | కె. సు. | 1-4 |
| లవకుశ | డిటో | 1-4 |
| సంపూర్ణ మహాభారతము | డిటో | 1-4 |
| ప్రౌఢ కృష్ణలీల | డిటో | 1-4 |
| భక్తకుచేల | డిటో | 1-4 |
| పాండవోద్యోగము | తి. వెం. | 1-12 |
| పాండవ విజయము | తి. వెం. | 1-12 |
| సతీ సక్కుబాయి | సో. రా. | 1-8 |
| సతీ అనసూయ | డిటో | 1-4 |
| గంగావతరణము | డిటో | 1-8 |
| భీష్మబ్రహ్మచారి | డిటో | 1-4 |
| దాన వీరకర్ణ | డిటో | 1-8 |
| మహాభక్తవిజయము | డిటో | 1-2 |
| భోజకాళిదాసు | డిటో | 1-4 |
| కాలకేశనము | డిటో | 1-4 |
| రాధాకృష్ణ | పా. లు. | 0-12 |
| పాదుకాపట్టాభిషేకము | డిటో | 1-12 |
| విప్రనారాయణ | డిటో | 1-8 |
| కోకిల | డిటో | 1-8 |
| ముద్రిక | డిటో | 1-0 |
| సరస్వతి | డిటో | 1-4 |
| వీరమతి | డిటో | 1-4 |
| పూర్ణిమ | డిటో | 1-4 |
| గయోపాఖ్యానం | చి. లు. | 1-0 |
| ప్రసన్నయాదవము | డిటో | 0-12 |
| పారిజాతాపహరణం | డిటో | 0-12 |
| తిలోత్తమ | డిటో | 0-12 |
| సొరాబ్ రుస్తుం | అ. హ. | 1-0 |
| భక్తత్యాగరాజు | దే. చి. | 0-12 |
| రుక్మాంగద | జే. ధ. | 1-0 |
| శ్రీరామాంజనేయం | సి. చి. | 1-0 |

ఓం!

శ్రీహయగ్రీవాయ నమః

# విడాకులా?

# (DIVORCE?)

## (సాంఘిక నాటకము)

గ్రంథకర్త:

గుళ్లపల్లి నారాయణమూర్తిగారు L. M. & S.



ప్రకాశకులు:

శ్రీ కురుకూరి సుబ్బారావు అండ్ సన్

ప్రాప్తియగును:

సరస్వతీ బుక్ డిపో, బెజవాడ.

---

రెండవకూర్పు 500 ప్రతులు

---

1944



వెల రు. 1—8—0

# అంకితం

నా నాటకాలు జయప్రదంగా ప్రదర్శించి ప్రచారానికి తోడ్పడిన అనకాపల్లి అమెచ్యూర్ నటసుంఘలి సభ్యులకు.

## హెచ్చరిక

ఈ నాటకంలోని ఏ భాగమైనా రంగస్థలంమీద గాని, రేడియోద్వారాగాని ప్రదర్శించడానికీ ఇతరత్రా ఉపయోగించడానికీ ప్రకాశకుల లిఖితపూర్వకమయిన అనుమతి విధిగా పొందితీరాలి. అన్నిహక్కులు ప్రకాశకులవే.

ఇట్లు – ప్రకాశకులు,

కురుకూరి సుబ్బారావు అండ్ సన్, బెజవాడ.

### ఈ నాటకములోని పాత్రలు

కామశాస్త్రి :–
(విజయనగరంలో ఒక పురోహితుడు.)

సూర్యప్రకాశం :–
(అతని మొదటిభార్యా కొడుకు.)

సీతమ్మ :–
(కామశాస్త్రి రెండవభార్య.)

రత్నం :–
(సీతమ్మ కూతురు.)

రామారావు :–
(పింఛను పుచ్చుకొన్న ప్రిన్సిపాల్.)

శారద :–
(కామశాస్త్రి కుమార్తె.)

శంకరరావు :–
(కామశాస్త్రి విద్యార్థుడు; ఛైయిర్మన్.)

వేణుగోపాలరావు :–
(అతని కొడుకు.)

వెంకటరావు :–
(జిల్లా మునసబు.)

పద్మనాభం :–
(ఛైయిర్మన్ తాలూకు మిల్లు మేనేజరు.)

నౌకర్లు, వంటబ్రవాడు, చిల్లరపాత్రలు.

కథాసమయం 1934 సంవత్సరం ఏప్రిల్, మే.

# మనవి.

1934 సంవత్సరంలో మద్రాసులో జరిగిన నాట్యకళా పరిషత్తులో ఉత్తమమయిన తెలుగు సాంఘికనాటకానికి వెయ్యినూటపద హార్లు బహుమతి ఇస్తామనీ, మూడేసిప్రతులు పంపవలసిందనీ, కొన్ని నియమములు పెట్టి పరిషత్తువారు తీర్మానించి ప్రకటించారు. 47గురు కవులు నాటకాలు రచించి మూడేసి ప్రతులు వ్రాయించి పంపారు. మరుసటి పరిషత్తువారు రెండేండ్లు పుస్తకాలు చెదపట్టించి, ఏ నాటకానికీ బహుమతిపొందే అర్హత లేదని ప్రకటించి, ఆంధ్ర దేశంలో నాటకకర్త లేడని చాటారు. పరిషత్తుకు పోటీకి పంపినప్పుడు ఈనాటకం పేరు "భావదాస్యం" తరువాత దీనికి విజాతులని పేరుమార్చి బెజవాడలో జరిగిన పరిషత్తులో ప్రదర్శింపచేశాను. బహుమతి ప్రకటించిన సంవత్సరము నాట్యకళాపరిషదధ్యక్షులయిన డాక్టరు శ్రీ గోవిందరాజుల వేంకట సుబ్బారావుగారు ఇతరమిత్రులు చాలా శ్లాఘిస్తూ ఉపన్యాసాలిచ్చారు. నాకు అంతేచాలు.

నాట్యకళాపరిషత్తువారి నిర్ణాయకులలో ఒకరైనను సుహృ ద్భావంతో నాకోరిక మన్నించి తొలిపలుకు వ్రాసియిచ్చిన ఆచార్య డాక్టరు బుర్రా శేషగిరిరావు పంతులుగారికి, సదభిప్రాయాలిచ్చి ప్రోత్సహించిన, శ్రీ రాఘవాచారి, ఏ. యస్. పి. అయ్యర్, డాక్టర్ గోవిందరాజుల సుబ్బారావు, శివశంకరశాస్త్రి, వేలూరి శివరామ శాస్త్రిగార్లకును జయపుర సంస్థానాధీశ్వరులు సాహిత్య సమ్రాట్ శ్రీ శ్రీ శ్రీ విక్రమదేవవర్మ బహద్దరువారికిని చాలా కృతజ్ఞుడను.

చివరి కొక్కమాట. ఆంధ్ర నాటకకళాపరిషత్తు జన్మించి పది కొండు సంవత్సరాలయి, మహామహులంతా అధ్యక్షులయినా ఆంధ్ర నాటకకళ ఒక్క అంగుళమయినా ముందుకు సాగలేదు. నాటకకళాభి వృద్ధి ఇతరత్రా జరగకపోయినా, పరిషత్తువారు ప్రతిసంవత్సరమూ ఆరు క్రొత్తనాటకాలు నవీనపద్ధతులతో రచింపజేసి ప్రచురిస్తే ఆంధ్ర నాటక వాఙ్మయమైనా కొంత చిగురుస్తుంది.

అనకాపల్లి,<br>30—11—44.

రచయిత.

ఓం !

బ్రహ్మకృపాహి కేవలమ్.

# ఉపక్రమణిక.

---

[విజయనగరంలో ఒకవీధి, ఖద్దరు దుస్తులూ మెడలో ఒకసంచి, గాంధీటోపీ, మెడలో పూలహారాలతో ప్రకాశం కొందరు కాంగ్రెసు భక్తులు పాడుకుంటూ ప్రవేశం.]

పాట

రఘుపతిరాఘవ రాజారామ్
పతితపావన సీతారామ్
సుందరమాధవ మేఘశ్యామ్
గంగాతులసీ సాలగ్రామ్
దానవమర్దన రాజారామ్
దశరథనందన సీతారామ్
సజ్జనరక్షక రాజారామ్
దుర్జనశిక్షక సీతారామ్.

(ఒకపౌరుడు ప్రవేశించి) ఏమిటి బాబూ ఈసంబరం ?

ఒక అనుచరుడు జవాబు—మన శామశాస్త్రుల్లుగారబ్బాయి సూర్యప్రకాశంగారు, ఇవాళే జయిలునుండి విడుదలయి వచ్చారు. అందుకూ ఈ ఊరేగింపు.

(పాట పూర్తిఅయేక వెళతారు)

---

ఓం.

బ్రహ్మకృపాహి కేవలమ్.

# విడాకులా?



## మొదటి రంగము



[విజయనగరంలో కామశాస్త్రి ఇల్లు. సమయం మధ్యాహ్నం మూడుగంటలు—కామశాస్త్రి, 50 సంవత్సరాల వయస్సు, శుద్ధ శ్రోత్రియవేషం, నస్యాం తయారుచేస్తూఉంటాడు. భార్య సీతమ్మ 30 సంవత్సరాల వయస్సు, సామాన్యసంసారివేషం, విస్తళ్లు కుడుతూ ఉంటుంది. కూతురు రత్నం 15 సంవత్సరాల వయస్సు, ఒక తెల్లటి గుడ్డరవిక కుట్టుకుంటూఉంటుంది. పైపనులకి కావలసినసామగ్రిలన్నీ రంగస్థలంలో ఉంటాయి.]

రత్నం—నాన్నా! శుభ్రమైన దారపుండేనా తెప్పించమూ, ఓ కాసీ యిచ్చి.

కామ—భలే! హాజరు లేసి బంట్రోతూ! ఓ కాసీయిచ్చి దారపుండ తేరా!

సీతమ్మ—అన్నిటికీ వెటకరణమే! దర్జీవాడు జేబుడబ్బు లిచ్చుకుంటాడని నాడిచేత కుట్టించకాపోయి, ఓ దారపుండేనా కొనపడేయక పోతే ఎలా అఘోరిస్తుంది?

కాము—మరి తెప్పించవద్దేమిటి నీ మొహం నా మొహమూను? మనకి నౌకర్లూ చాకర్లూ సిద్ధంగా ఉన్నట్లు! అసలు మునసబుగారింటికి వెళ్ళాలి. ఎల్లుండి ఆమునసబ్గారి తద్దినముంది జ్ఞాపకంచేయడానికి. అలా పేటలోకి వెళ్ళినప్పుడు నేనే కొనితేవాలి.

సీతమ్మ—దర్జీవాడిచేత కట్టించేస్తే ఎంత బాగుండును! బేడ డబ్బులకి మొహంచూసుకున్నారుకాని. ఆ చింపులు తెలీక అలా దేవులాడుతూంది!

కామ—బేడడబ్బులంటే నీకు చవకగా కనబడుతున్నాయి! నువ్వు చింపిపెట్టలేకపోయేవా? నీ రవికలన్నీ నువ్వే కుట్టుకొంటావు గదా!

సీతమ్మ—నాదీ ఓ కుట్టా! నా బతుకూ ఓ బతుకే! ఇది అలాటి రవిక కాదు. అదేదో జంపరట! మునసబుగారి పిల్లలూ వాళ్ళూ తొడుక్కుంటున్నారు, చూడ లేదుటండీ?

కామ—ఆఁ! నా కిదే పరీక్ష! వాళ్ళేలాటి రవికెలు తొడుక్కుంటున్నారో, ఏ చీరలు కట్టుకుంటున్నారో నా కిదాపని? మునసబుగారింట్లో, కచేరీ వేళ మించిపోకుండా దేవతార్చన తెల్లార్చడంతో సరి నాపని.

రత్న—ఓ రంగుగుడ్డేనా తెచ్చిపడేశావు కాపూ! వెధవ ప్లైను గుడ్డ! నా చింపులన్నీ తప్పయిపోతున్నాయికూడాను. ఊళ్ళో ముట్టెత్తుకొనే ముండలాగుంటాను ఈ రవికె తొడుక్కుంటేను.

కాము—వేరే అనుకోవక్కరలేదు. నీ బతుకు తువ కలాగే అయేలాగుంది. వెధవ! దుర్మార్గపు వెధవ! ఇంత కళ్లనెత్తికొస్తాయనుకోలేదు. ఇటి న్యాయానికి కాలంకాదే! కాస్తోకూస్తో ఆ అమలాపురపు కొబ్బరికాయల వర్తకంలో సంపాదిస్తున్నాడుకదా! భగవంతుడుకూడా వాడికే సాయం చెయ్యాలా? అగ్గిపెట్టె అయిదువేల రూపాయల లాటరీ వాడికే రావాలా చెప్పు! పూటకి గతిలేకుండా ఉన్నాం గదా మనలాటి వాళ్ళకి రాకూడదూ!

సీతమ్మ—మనకంత అదృష్టంకూడానా? పెట్టుబడి మీదయింది. ఫలం అతనిదయింది.

రత్నం—నాన్నా! నువ్వూ వేశావేమిటి లాటరీ?

కాము—అసలు వేసిందే నేను, ఆవేళ వాళ్ళింటిదగ్గర లేకున్నా నే! నీ పెళ్ళయినతరువాత అల్లుణ్ణి—అల్లుడు! అల్లుడు! పిల్లనిచ్చి...

నాకు నోరు తిన్నగాతిరగదు—ఆ సౌర్భాగ్యుణ్ణి పంపుక్కి పిలవడానికి వెళ్ళానా! అవేవో గుర్రప్పందేల లాటరీలట! నువ్వూ వెయ్యి వోయి బావా అన్నాడు మామావగారు. దరిద్రం నెత్తిమీద తంతూంటే మంచో బుద్ధి ఎలా పుడుతుంది?

సీతమ్మ—ఊరికే పెంచి చెప్పడనికేమీ లేదే! ఈయనపేరు పెడితే రాదేమో అని, సిరిగలపేరుగదా అని మామావగారిపేరు పెట్టి వేశారే! అతగాడికి అరవై లక్షలో అరవైవేలో ఎంతో లాటరీ వచ్చిందే! కావలిస్తే నీ పదిరూపాయలూ నువ్వు పట్టుకుపో! ఈ డబ్బంతా నాదే అని అతగాడు ఎగేశాడే! బుర్రిలుమార్చి బుర్రలు పెట్టేమనవని తెలిసుండీ అలా చేసుకోవడ మేమిటి?

రత్నం—ఇదంతా నాకు తెలియనే తెలియదమ్మా! నేను తాత గారింట ఉన్నప్పుడు జరిగింది కాబోలు! ఇంతకీ, అదృష్టముండాలిగాని నాన్నపేరు పెట్టి వేస్తేమాత్రం రాకపోతే ఏం జేస్తాం!

సీతమ్మ—అలాగని మీనాన్న ఊరుకొన్నారా? పెద్దతగువు పెట్టారు. సాక్ష్యాలూ సంపన్నాలూ పెట్టారు డబ్బులో సగమేనా ఇస్తేగాని వల్లకా దన్నారు. నువ్వొంతంటే నువ్వొంతవరకూ వచ్చింది. తుదకి నీ కాపరానికి నీళ్ళు పోయడానికి కారణ మదేను.

కామ—వెధవమాటలు! నోటి కెంతొస్తే అంతా పేలకు! దీని కాపరానికి నీళ్ళు పోయడానికి నేనా కారకుణ్ణి? ఎక్కడో ఎనిమిదేళ్ళనాటిముచ్చ తీసుకొచ్చి దీనికి ముడేస్తా వేమిటి?

సీతమ్మ—ఇంకా అనుమాన మేమిటి? దీ సంతటికీ మూల కారణం అదే!

కామ—ఏమిటీ మాటలూ? వాడు డబ్బొచ్చి కళ్ళు నెత్తికొచ్చి ఊర్ధ్వదృష్టేకాని అధోదృష్టి లేకండా మద మెక్కి మసులుతూ, నా కొడుక్కి మళ్ళా పెళ్ళిచేస్తానని పదిమందిలోనూ పదేపదే చాటుతూంటే దీని కాపరానికి నేను నీళ్ళుపోశానని ఏడుస్తా వేమిటి?

సీతమ్మ...అతగాడు అలా అన్నాడేకాగట్టండీ! పిల్లని కనుక్కొన్నవాళ్ళూ పిల్లనిచ్చుకున్నవాళ్ళూ ఎలావుండాలి? మాపిల్ల నెలా

గయినా మీకడుపులో పెట్టుకొని భరిస్తేగాని ఎలాగని కాళ్ళా వేళ్ళా పడి బతిమాలుకోవాలిగానీ, నువ్వెంతంటే నువ్వెంతని తగువులాడితే పనికొస్తుందా ? కార్యవాదులం మనం గదా !

కామ—ఆ అభాజనుణ్ని నేను కాళ్ళావేళ్ళాపడి బతిమాలుతానా ? ఈనాటి సంబంధమా ? తరతరాలనుండి మాకు వాళ్ళకీ సంబంధాలు విడిపోకండా కలిసొస్తున్నాయిగదా ! వాడదేమేనా ఆలోచించాడా ? పెళ్ళిచేసుకుంటే చేసుకో. నా పిల్లకి నేను తిండిపెట్ట లేకపోతానా అనేశాను.

సీతమ్మ—ఆమాటకూడా అనేశారూ ?

కామ—ఆఁ! మొన్న వెళ్ళినప్పుడు నలుగురు పెద్దమనుష్యు లనీ పిలిపించి తగువుపెట్టి మొహంమీద పేడనీళ్ళు జల్లించానే.

సీతమ్మ... మీరు వెళ్ళడ మెప్పుడు ? ఇది జరగడ మెప్పుడు ? ఇంకా నే నేదో ఆశపడుతూంటే ఉట్టికి నాలుగుచేర్లూ తెంచేశారూ ?

కామ—నీకు మందమతి ! రామబ్రహ్మంగారి అబ్బాయికి పెళ్ళి చేయించడానికి యానాం వెళ్ళినపుడు ఆ నాలుగడుగులూ ఆ వూరలా వెళ్ళానని చెప్పలేనూ ?

సీతమ్మ—బాగానే ఉంది. ఇన్నేళ్ళు వచ్చినా మీకే బాధ్యత నాటలేదు. మీ కేంపోయింది? ఇంట్లో పడుండేదాన్ని నేను భరించాలి. ఓసమ్మో అంటే ఆసమ్మో అని నలుగు రమ్మలక్కలూ నోళ్ళు నొక్కుకోడాని కొచ్చింది.

కామ—ఒక్కమాటకి సమాధానం చెప్పు. ఇందులో తప్పెవరిది ? మొదట చదువురా దన్నారు, తరవాత 'సంగీతం రా దన్నారు. పోనీకదా! నలుగురూ ఏమనుకొన్నా సరేనని మొన్న మొన్న రజస్వలా అయేదాకా పెద్దాడబడికి పంపించామా? మునసబు గారి పిల్లలతో బాటు ఆర్మనీ నేర్చుకుందా ? ఇంకా ఎందుకు చెప్పు వాడికి తెగులు ? ఇదంతా కారణంకాదు ! డబ్బు వచ్చింది; పెద్ద వేషం వేస్తున్నాడు; మునిసిపల్ ఛెయిర్మేనయాడు; కొడుకు బి. ఏ. చదువుతున్నాడు; ఇప్పుడు పెళ్ళిచేస్తే ఏపదివేలో కట్నం లాగొచ్చును.

సీతమ్మ—మీా పట్టుదలే చూశారుకాని పిల్లబాగు చూశారా?

కామ—ఏడిశావు పోదు! నాతో మరింక ఈ ప్రస్తావన తేకు.

రత్న—అన్నట్టు అమ్మా! అన్నయ్య ఇవాళే వస్తాడటే!

సీతమ్మ...ఎవరు చెప్పారూ?

రత్నం—నాకు తెలిసింది. నిన్ననే జయిలునుంచి విడుదల చేశారనీ. ఇవాళ ఈ ఊరు వస్తాడనీ!

సీతమ్మ—అతను వచ్చేదాకా ఆగనేలాగేరా? తగుదునమ్మా అని వెళ్ళి కార్యం సాధించడం పోయింది సరేకదా; తుదముట్టా తెంచుకు మరీ వచ్చారమ్మ! ఇదేం మనిషోకాని-

కామ—ఏమిటే నీవెర్రి! ప్రికాశిగాడు వెళితే నాకన్న ఎక్కువ సాధిస్తాడటే? ఖైదులోకి వెళ్ళిన అభాగ్యుడికి పరువూ ప్రతిష్ఠా కూడానా? గాంధీకేసులో ఖైదులోకి వెళ్ళినవాళ్ళని చూస్తే అతగాడికి అరికాలుమంట నెత్తికెక్కుతుందా లేదా?

సీతమ్మ—అబ్బాయిని అంతవాడింతవాడని పేపర్లలో పొగుడుతున్నారట! అమ్మాయి చెప్పింది.

కామ—వెర్రికక్కుగట్టలకేమి?

రత్నం—అసలు అన్నయ్య వస్తే ఈ విదేశీగుడ్డలు చూసి తిడతాడుగూడాను. దాచేస్తా నమ్మా!

(రవికకట్టు గుడ్డలన్నీ దాచేయడానికి సిద్ధంగా మూట కట్టేస్తుంది)

కామ—ఆఁ! తిడతాడు. వీడూ వీడిగాంధీ వచ్చి స్వారాజ్యం తెచ్చి నెత్తిమీాద పెడతారనీ. ఖైదులో కెళ్ళి చోడంబలీ, తోపా తింటే స్వారాజ్యం ఎదురుగా వస్తుందా?

రత్నం—అన్నయ్యమాట లెక్కేమిటి? మహామహావాళ్లు త్యాగంచేసి జైలుకు వెళుతూంటే?

కామ—ఈ గాంధీదగ్గర మంత్రిమో కనికట్టో ఏదో ఉంది కాబోలు. ఎంతమంది! ఎంతమంది! అందరికీ ఒక్కసారే రావాలా వినాశకాలం? తిన్నగా తినిఉండలేక సుబ్రిహ్మణ్యాం ఎందుకు చెప్పూప్ప వకాల్తీ పాడుచేసుకొని జైలుకు వెళ్ళడం? ఇంక ఇంటికి వచ్చేడా

తిండికిలేదు, అప్పుపుట్టదు. ఎంతమంది కుటుంబాలు పాడుచేశాడే ఈ గాంధీవచ్చి! వాడి ననవలసిన పనేమిటి, వీళ్లకు మతులు పోతూంటే?

రత్న—అలా అనకు నాన్నా! గాంధీ మహాత్ముడు. అతని మహాత్తే ఇదంతా.

రామ...అడ్డమేమిటి? వాడొక మహాత్ముడు, నే నొక మహా ఋషినీ. దేశం అంతా ధ్వంసంచేసేసి, కరువు పెట్టించేసి ధరలు హెచ్చుచేసేసి, బంగారం ప్రియం చేసేసి ఎవడిదగ్గరా డబ్బాడకుండా చేశాడా? అందుచేత వాడు మహాత్ముడు. ఈ నిర్భాగ్యు డింటికి రానీ, గాంధీ గింధీ వదలకొడతాను.

సీతమ్మ—ఏం చేస్తారు?

రామ—ఏం చేస్తానా? నాలిక కాల్చుకొని ప్రాయశ్చిత్తం చేసికొంటేనేగాని ఇంట్లో అడుగుపెట్టనివ్వను. ఎట్టాగా తీగె కాల్చి నాలిక్కి చురకంటిస్తే అప్పుడు గాంధీ కనబడతాడు.

రత్నం-అదేమిటి నాన్నా! బాగానే ఉంది? ఎంతమంది జైలుకి వెళ్ళారుకారు? ఎంతమంది మామూలుగా ఇంటికి వచ్చి ఉండలేదు.

సీతమ్మ—అలాటి వేమీ చేయకండోయి! మీ పుణ్యం ఉం టుంది. ఇదంతా ఈవిడే చేయించింది. సవితికొడుకుమీద కిట్టక అని న న్నాడిపోస్తారు.

రత్నం—అసలు అన్నయ్య ఒప్పుకుంటేనా?

రామ—ఒప్పుకోకపోతే ఇంట్లోంచి పోతాడు. కైదులోకి వెళ్ళి అడ్డమైనవాళ్ళతోను, అడ్డమైన తిళ్ళూ తినివచ్చినవాడని ఇంట్లో పెట్టు కుంటే నాకు మళ్లా కూడు పుడుతుందా? కులంలో వెలెయ్యరూ? ద్వాదశినాడేనా ఎవడేనా ఓకాని డబ్బిస్తాడా?

సీతమ్మ—ఇలాభయపడే చిన్నపిల్లప్పుడే దీనికి ముడెట్టేశారు. ఇప్పుడు వందలూ వేలూ. సమర్తాకిన పిల్లలకి బాహాటంగా పెళ్లిళ్ళు చేస్తున్నారు. వాళ్ళ నెవరూ వెలెయ్య రేమి?

రామ—నేగె వెలెయ్యాలా ఏమిటి? వాళ్లిళ్లకి ఎవరు వెళుతు న్నారు తిండికి? ఎవరో ఉద్యోగస్థులూ కర్మభ్రష్టులూ వెళుతున్నారు.

సీతమ్మ—ఆమాటలకేంలెండి. పాతికరూపాయలు దక్షిణిస్తే మీరే వెళ్ళి అలాంటి పెళ్ళిళ్లు చేయించి భోజనాలుకూడా చేసివస్తారు. ఎందుకక్కరలేనిమాటలు? వాళ్లలాగే ఇప్పటిదాకా మనపిల్లని పెళ్ళి చెయ్యకుండా ఉంచేస్తే ఇష్టాయిష్టాలు చూచుకొని వాళ్ళే చేసికొందురు.

కామ—నేను చేసిన అకార్యకరణం ఏమిటో చెప్పు. కలిసిన సంబంధం. చెల్లెలికొడుకు. కాస్తోకూస్తో తిండికి ఉన్నవాళ్ళు. శుభ్రమైన కుర్రవాడిని చూసి ఇచ్చేనుకాని, డబ్బుపుచ్చుకొని ఏ ముసలాడికో ఇచ్చి పెళ్ళిచేయలేదుకద. దానదృష్టం అలా మండిపోతే నేనేం చెయ్యను? అప్పుడు నువ్వుమాత్రం సంయ్ అంటే సంయ్ అన్నావా లేదా?

సీతమ్మ—ఇన్నీ బాగుండబట్టే నేనూ ఒప్పుకొన్నాను. ఆపాటి దానికి వాళ్ళతో తగువు పెంచకుండాపోతే ఎంత బాగుండును?

కామ—మళ్ళా అదేమాటా? వాళ్లని బతిమలాడే ప్రస్తావన నా దగ్గర తేవద్దని చెప్పలేదూ?

(రఘుపతి రాఘవ రాజారామ్
పతితపావన సీతారామ్
అనేపాట చాలామంది పాడుతున్నట్లు వినబడుతుంది.)

రత్నం—(వీధివేపు చూచి) అదిగో! అదిగో! అన్నయ్యో!

(అందరూ ఆశ్చర్యంగా చూస్తారు)

కామ—ఆఁ! ఆఁ! ఇక్కడికే వస్తున్నారేమిటి? అదేమిటి? ఆ భజన వీడికేనేమిటి?

రత్నం—ఇక్కడికే వస్తున్నారు నాన్నా! ఎంతమందో! ఎన్ని గాంధీ టోపీలో!

సీతమ్మ—పెళ్ళిళ్ళు బంగారంగాను! ఆ భజనలూ, పాటలూ ఇతనికోసమే. చూశావా? వాళ్లంతా అంత ఉత్సాహంతో అతన్ని ఊరేగిస్తూ తీసుకొస్తూంటే మీనాన్న ఇలా అంటారేమిటే?

(ఖద్దరు బట్టలు, గాంధీటోపీ, మెడలో పూలహారాలతో ప్రకాశం ప్రవేశిస్తాడు. తల, గెడ్డం పెరిగిఉంటుంది, వయస్సు ౨౫ సంవత్స

రాలు. కొంతమంది అనుచరులు అటువంటి వేషాలతోనే పాడుతూ వస్తారు. అందరూ భరతమాతకీ జే! అని కేకవేస్తారు. రత్నం తొందరగా వెళ్ళి కుంకం భరిణతెచ్చి ప్రకాశంకు తిలకం పెడుతుంది.]

రత్నం—ఏం! అన్నయ్యా! వచ్చావా!

ప్రకా—అంతా క్షేమమా?

రత్నం—మా క్షేమాని కేమిలే! మేము ఇంటిపట్టునే ఉన్నాం. నానా శ్రమదమాలు పడి నువ్వు కులాసాగా రావడమే రావడము.

[అనుచరులంతా సెలవు పుచ్చుకొని 'భరతమాతకీ జే!' అని కేకవేసి వెళ్ళిపోతారు. ప్రకాశం తల్లికీ తండ్రికీ నమస్కరించి కూర్చుంటాడు.]

కామ—ఒరే! అబ్బీ! బాగుందికాని, మనశాస్త్రప్రకారం ప్రాయశ్చిత్తం చేసికొననిదే ఇంట్లో అడుగు పెట్టకూడదంటారు, ఎప్పుడేనా విన్నావా?

ప్రకా—ప్రాయశ్చిత్త మేమిటి?

కామ—ప్రాయశ్చిత్త మేమిటా? బంగారపురేకు కాల్చి నాలిక మీద పెడతారు.

ప్రకా—ఎందు కది?

కామ—చేసినదోషానికి నివారణార్థం.

ప్రకా—నేను ఏమీ దోషం చేయ లేదే!

కామ—ఖైదులోకి వెళ్ళడం కులభ్రష్టువు కావడం! ఇదే దోషం.

ప్రకా—ఖైదులోకి నే నేదీ నేరంచేసి వెళ్ళలేదు.

కామ—ఏనేరమూ లేకపోతే శిక్ష ఎందుకు విధించారూ?

ప్రకా—కల్లుదుకాణాలదగ్గర పికెటింగుచేయడంచేత; అది నైతికంగా నేరం కాదు.

కామ—నా కదంతా తెలియదోయ్! ఖైదులో నువ్వు అడ్డమైన మాలకూడు తిన్నావా లేదా?

ప్రికా—అక్కడ జాతిమతవిచక్షణలేకుండా అంతా ఒక పంక్తినే భోజనం చేసేవాళ్ళం.

సీతమ్మ—అన్నికులాలవాళ్ళూ ఒకపంక్తినే ?

కామ—నాకు తెలుసునే! అందుకనేకామా ప్రాయశ్చిత్తం చేసుకోమనడం !

ప్రికా—నాలుక కాలిస్తే ప్రాయశ్చిత్తం ఎలాగవుతుందీ? నాలుకవల్ల కలిగేదోషం అనృతం. ఆ దోషానికి నాలుక కాలిస్తే ప్రాయశ్చిత్త మనుకోవచ్చు. నేను చేసినది దోషమే అయితే దానికి ప్రాయశ్చిత్తం పశ్చాత్తాపమే.

కామ—బాగుంది. బాగుంది. వితండవాదన మానేసి,కంసాలి శరభయ్యని పిలుస్తాను. ఆ శాస్త్రా అయిందనిపించుకో? లేకపోతే ఇంట్లో విస్తరివెయ్యడానికే వీలులేదు.

ప్రికా—ఇన్నివేలమంది జైలుకి వెళ్లారుకదా! వీళ్లంతా ప్రాయశ్చిత్తం చేసికొన్నారా? ఇప్పుడనేకమంది సముద్రయానం చేసివస్తున్నారు. అనేకమంది రజస్వలావివాహాలూ, వితంతువివాహాలు చేస్తున్నారు. వీళ్లంతా ప్రాయశ్చిత్తాలు చేసుకొంటున్నారా ?

కామ—వాళ్లంతా కర్మభ్రష్టులూ, కులభ్రష్టులూను.

ప్రకా—అసలు ప్రాయశ్చిత్తం అవసరము లేదని నా నమ్మకం; బాహ్యేంద్రియాలని హింసించడం ప్రాయశ్చిత్తం కాజాలదు. చిత్తసంస్కరణ చేసేదే ప్రాయశ్చిత్తం.

కామ—చాలాదూరం చదువుకున్నావుగాని, శిష్టాచార ప్రకారం ప్రాయశ్చిత్తం జరిగితీరాలి. అందుకు ఒప్పుదలయితే సరేసరి! లేకపోతే నిన్ను ఇక్కడ ఉంచుకొని మేమంతా కులభ్రష్టులం కావలసి వస్తుంది. ఇదివరకు వచ్చిన అప్రతిష్ఠచాలు; ఇదికూడా తెచ్చిపెట్టకు.

ప్రకా—ప్రాయశ్చిత్తం చేసికోకపోతే ఇంట్లో ఉండకూడదా? మీరే శిక్షచేసినా సరేగాని, మనస్సాక్షికి వ్యతిరేకమయిన పని మాత్రం నేను చెయ్యను.

కామ—ప్రాయశ్చిత్తం చేసుకోవన్నమాట.

ప్రకా—అది కేవలం అనవసరమని నా అభిప్రాయం.

కామ—అది చాలా అవసరమని నా అభిప్రాయం. అలాజరగని పక్షమందు నీ కిక్కడేమీ సంబంధం లేదు.

సీతమ్మ—బాగానే ఉంది. మధ్యని నాకు వాదు తెచ్చిపెడతారు కాబోలు ఇద్దరూ కలిసి? మీ॰ పుణ్యం ఉంటుంది ఊరుకుందురూ! ప్రాయశ్చిత్తమూ లేదు, ఏమీ లేదు. ఎవరయినా అడిగితే అలాగే చేసికొన్నాడని చెప్పండి.

కామ—వాడి కాపట్టుదలేమీ? అలాగే అనకూడదూ?

సీతమ్మ—ఆయనతో నేమిటి అబ్బాయి! అలాగే అందూ!

కామ—ఎవరైనా అడిగినప్పుడేనా ప్రాయశ్చిత్తం చేసికొన్నానని వా డనకపోతే నేను మళ్లా వీధిలో తలెత్తుకొని తిరగగలనటే!

ప్రకా—గాంధీమహాత్ముని శిష్యులూ సత్యాగ్రహులూ అసత్యమాడరు. నేను ప్రాయశ్చిత్తంచేసుకో లేదని ఘంటాపథంగా చెపుతాను.

కామ—చూశావా వాడి తెగనీలుగు! [ప్రకాశంతో] మరి దయచేయి. నువ్వు ఈయింట్లో ఉండడానికి వల్లకాదు.

ప్రకా—[లేస్తాడు.]

రత్నం—అన్నయ్య వచ్చాడని నేనెంతో ముచ్చటపడుతూంటే ఏమిటి నాన్నా నువ్వు మరీన్నీ?

సీతమ్మ—ఇదేం పాపమమ్మా! నా మెడకుచుట్టుకుంటుందీవాదూ! సవితితల్లి ఇంట్లోంచి తగిలేసిందంటారు, [భర్తతో గట్టిగా] మీ రూరుకుంటారా? ఊరుకోరా?

కామ—ఛీ! పింజారీముండ! నోరు ముయ్యి! ఆ పెంకితనమేదో నేనూ చూస్తాను. ఇంత తెగులేం? వద్దువద్దంటూంటే బంగారులాగు కాశీలో బి. ఏ. చదువుతున్న చదువు తగలెట్టుకోడ మేమి? అక్కడనుంచి వచ్చేసి కల్లుదుకాణాలదగ్గర తాగుబోతువాళ్ల కాళ్లట్టుకొని బతిమాలుకోడ మేమి? ఖైదులో పడి రెండేళ్ళు కూచోడమేమి? ఇంటికొచ్చి మళ్లా ఈ శ్రీరంగనీతు లేమి? నా లక్ష్య మేమేనా ఉందా వీడికి? ఈపాటికి బి. ఏ. పాసయితే ఏ మునసబుగారికాళ్లో పట్టుకొని

ఓ పని చెప్పించనూ? ఇంక తిపమను! కానీ తెచ్చేశక్తిలేదుగాని తెగ నీలుగు లెక్కువ! బాగా గడించి ఇంట్లో పెట్టుకొన్న వాళ్ళు ఖైదులోకి వెళతారు, ఎన్ని వేషాలేనా వేస్తారు.

ప్రికా—మనకంటె బీదవాళ్ళు వందలకొద్దీ జయిలుకి వెళ్ళి మహాత్యాగం చూపించారు.

కామ—ఏడవలేకపోయారు. తన్నుమాలిన ధర్మం, మొదలు చెడ్డబేరమూనా ? చదువు సంధ్య మానుకొని దేశదిమ్మరిలాగు ఖైదు లోకి వెళ్ళి కూచుంటాడా ? త్యాగం! త్యాగంచేశారు వీళ్ళు. ఆ కోర్టులో కలక్టరేదో అడిగితే అడ్డదిడ్డంగా పెంకి జవాబులా ? అతడు యాభయిరూపాయలు జరిమానా వేశాడుగదా! చచ్చీచెడి చీమూ నెత్తురులాగు కూడబెట్టుకొన్న డబ్బంతా వాళ్ళ యధాన్ని పోశానే, ఆకష్టం వీడి కేమయినా తెలుసునా ? మధ్యని మహాత్యాగి వీడా?

ప్రికా—ఆ ఫలం దక్కించుకుంటే మీరూ త్యాగులే!

కామ—మరొక రెండుమాట్లు ఖైదులోకి వెళ్ళి మళ్ళా జరి మానా పడితే, ఈ ఉన్న కొంపాగోడూ త్యాగమయిపోతుంది. ఫలం బాగా దక్కుతుంది. జరిమానా వెయ్యకుండా ఎముకలు విరగ్గొడితే త్యాగం వదలిపోను.

ప్రికా—మళ్ళా సత్యాగ్రహం వస్తే మళ్ళా వెళతాను. ఎము కలు విరిగినవాళ్లుమాత్రం వెళ్ళలేదూ ?

కామ—అక్కడే ఉండిపో! గడియగడియకీ రావడ మెందుకు? ఇంటికన్న గుడే పదిలంలాగుంది. నువ్వక్కడుండడంవల్ల మా కేమీ పెట్టిపోషించేది తప్పిపోలేదు. ఒక మాటు కాదు, పదిమాట్లు వెళ్లు, నామీదికి రాకుండా నేనూ చూసుకుంటాను.

సీతమ్మ—ఊరుకుందురూ బాబూ! అయిపోయినదానికి గర్ష ణెందుకూ ? అబ్బాయీ! అలాగే అందూ నాయనా! ఆ శరభయ్య మాత్రం మనిషికాడా ఏమిటి ? నాలిక చురికేలాగు కాలుస్తాడా ?

ప్రికా—పిన్నీ! నీకూ పుట్టిం దీ ఈ వెర్రి ? పూర్వాచారాలకి దాసులమైపోయి వాటిలో అవసర మెంతో అర్థ మెంతో గ్రహింప

కుండా లోకాన్ని మెప్పించడంకోసం మనం ఏపనీ చెయ్యకూడదు. మనస్సా ఇష్టం లేనిపని లోకంకోసం చెయ్యడం, లోకాన్ని మోస పుచ్చడం. నాన్న నన్ను ఇంట్లోంచి వెళ్లిపోమన్నారు. సంతోషంగా వెళ్ళిపోతాను. నామట్టుకు నిజంగా ఐశ్వర్యంకంటె దరిద్రంలోనే ఎక్కువ సుఖమున్నది. అదీగాక, దేశసేవకులకు ఏ ఆస్తులూ ఏ బంధనాలూ ఉండకూడదు. దేశసేవకు నాన్న నాకు చాలా అవకాశం ఇచ్చారు. మరి అందరిదగ్గరా సెలవు. [వెళతాడు]

సీతమ్మ—అబ్బాయీ! ఏమి టాతొందర! ఒక్కమాటు ఆగవూ?

[తొందరగా అతనివెంట వెళుతుంది.]

రత్నం—అన్నయ్యా! మాట, మాట. నామాట వినవూ?

[తొందరగా వీధిలోకి వెళుతుంది.]

కామ—ఈ ముండలికి మతిపోయింది కాబోలు! ఏమర్రోయి! మీా రిద్దరూ ఇలారండి! రారేం! అడాపెడా వాయించి ఇంట్లోకి తీసుకురావాలా ఏమిటి?

[కోపంగా, తొందరగా వెళతాడు.]

తెర.



ఓం!

బ్రహ్మకృపాహి కేవలమ్.

# విడాకులా?



## రెండోరంగము



సమయం. సా॥ 4 గంటలు.

[చెన్నపట్నం ట్రిప్లికేనులో రామారావు ఇల్లు, డ్రాయింగు రూము, రెండు బెత్తుషోఫాలు, రెండు బెత్తుకుర్చీలు, ఒక బెత్తు పడక కుర్చీ, రెండుమామూలుకుర్చీలు, ఒక టీపాయి ఉంటాయి. టీపాయి మీద ఒక శుభ్రమైన తెల్లనిగుడ్డ, పువ్వులతో గాజుపాత్రఉంటాయి. రామారావు పడకకుర్చీలో కూర్చొని వార్తాపత్రిక చూస్తూఉంటాడు. సుమారు అరవైసంవత్సరాలవయస్సు, నేలంఅంచులపంచ, బొత్తాము లన్నీపెట్టిన లాంగ్‌కోటు ధరించి నేలంఅంచుకండువా పైకి అంచులు కనబడుతూ మడతపెట్టి వేసుకొంటాడు. దగ్గర చేతికర్ర ఉంటుంది. శారద ప్రవేశిస్తుంది. కత్తిరించిన గిరజాలజుట్టు (Bobbed hair), పొట్టి రవిక, పలచని తెల్లసిల్కు‌చీర, పైటపిన్ను, రిస్టువాచీ, కళ్లజోడూ. కాళ్లకి మేజోళ్లూ, టెన్నిస్‌జోళ్లూ ధరించి, ఎవరికోసమో ఆతురతగా ఎదురుచూస్తూఉంటుంది. మధ్యమధ్య ఒక వ్యాయామసంబంధమైన మాసపత్రికలో బొమ్మలుచూస్తూఉంటుంది. వయస్సు 20 సంవత్స రాలు. బాగా అరవయాసతో మాట్లాడుతుంది.]

శారద—ఫాదర్! మీ గంట ఎంత?

రామా—నాలుగు.

శారద—ఇతన్ని సరిగా నాలుగుగంటలకే రమ్మంటినే! మన ఇండియన్సులో చాలామందికి అపాయింటుమెంటు (appointment) కీప్ (keep) చేసేదే తెలియదు.

రామా—అమ్మా! ఏమిటమ్మా నీ సంగతి రోజురోజుకీ మారి పోతూంది? ఆ వేష మేమిటి? ఆ జుత్తుకత్తిరిం పేమిటి? ఒకనాటి కొక నాడు దొరసానివై పోతున్నావే!

శారద—మోస్టు అప్టు డేట్ ఫాషన్ (most up-to-date fashion) ఇదేకదా ఇప్పుడు?

రామా—మనం తెలుగువాళ్లం, హిందువుల మన్నమాట బొత్తిగా మరిచిపోతే ఎట్లా?

శారద—మగవాండ్లు సూటూ, హేట్లూ, వేస్తున్నారుకదా! మగవాడు ఇండిపెండెంటు, (independent). ఆడదిమాత్రం స్లేవు (slave) దా!

రామా—మగవాడు సూటువేసుకొన్నా, ఆడది గానుతొడిగినా వెస్టర్న్ఫాషన్సు (western fashions)కి స్లేవ్సు (slaves)అన్నమాటే. మా చిన్నతనంలో ఆడది పచ్చగా పసుపురాసుకొని అర్థణా అంత కుంకంబొట్టు పెట్టుకొనేది. ఏమి విపరీతమయిన మార్పు వచ్చిం దీదేశంలో.

శార—ఆ డేజ్ (days) మారిపోయినాయికదా! సివిలిజేషన్ (civlization) మారుతూఉంటే మనంకూడా ఆ కరెంటు (current) తో పోవలసిం దిదా!

రామా—ముప్ఫయి సంవత్సరాల ఈమధ్యని ఎంత రివల్యూషన్ (revolution) వచ్చేసిందమ్మా ఆడ వాళ్లలో ఇంగ్లాండులో కూడా అంతేసుమా. ముప్ఫయిసంవత్సరాలకిందట ఇంగ్లాండులో స్త్రీ డ్రస్సుచూస్తే శరీరమెక్కడా కనబడకుండా కప్పిఉండేది. తరువాత రివల్యూషన్ వచ్చి ఆడది ఉద్యోగాలకి బయలుదేరడంతో మగవాడికి నిరుద్యోగంకూడా వచ్చింది. మగవాడిమీద విజయంపొందగానే ఆడది బురఖా తీసేసి గొంగళీపురుగు గూటిలోనుంచి సీతాకోకచిలుకలాగ

అందమైన నిజస్వరూపంతో బయటపడింది. ఆ గాలే మన దేశానికి విసిరింది.

శార—వాళ్లు రాజ్యంచేసేటప్పుడు వాళ్ల ఇన్‌ఫ్లుయన్సు (influence) ఎట్లా తప్పును ?

రామా—మీ మదర్ ఉంటే నీవు మరొకలాగు తయారు కావలసింది. నీ మదర్ (mother) ని నీ కేమయినా జ్ఞాపకముందా శారదా ?

శార—[లే దన్నట్లు తల ఊపుతుంది]

రామా— మీతల్లి చనిపోయేసరికి నీవు నాలుగేండ్ల పిల్లవు. నా కప్పటికి నలభై వయస్సు దాటింది. చాలామంది తిరిగీ మారేజీ (marriage) చేసికో మన్నారు కాని—

శారద—చాలామంది ఇంగ్లీషువాండ్లు ఫార్టీఇయర్సు (forty years) పిమ్మటనే పెండ్లి చేసికొంటారుగదా !

రామా—ఆ దేశపు పరిస్థితులనుబట్టి వాళ్ళ కది సరిపడింది. ఇక్కడ మనవాళ్ళు నలభై సంవత్సరాలకి డజనుపిల్లలు పుట్టి ముసిలాళ్లయిపోతారు. నా హేపీడేజ్ (happy days) అన్నీ మీ మదర్ తోనే పోయాయి.

శారద—ఈ దినం మీరు నిండా హేపీ (happy) గా ఉండవలె ఫాదర్ ! ఈ దినం నా పార్ట్నర్‌ని (partner) టీ (tea) కి ఇన్వైటు (invite) చేసినాను. మీకు ఇంట్రొడ్యూస్ (introduce) చేయవలె.

రామా—ఎవ రతడు ?

శారద—మిస్టర్ వేణుగోపాలరావు. నిన్నటిదినం అతడు నేనూ కలిసి మిక్సెడు డబుల్సు (mixed doubles) లో ఫైనల్సు విన్ (finals, win) చేసినాము.

రామా—మీ మేనమామ నిన్ను బొత్తిగా యూరపియన్ గర్ల్ (European girl) ని చేశాడమ్మా! చిన్నప్పుడు మీ మదర్ పోయినప్పటినుండి నువ్వతనిదగ్గర ఉండిపోవటం, అతడు హైపొజిషన్

(High position) లో ఉండి నిన్ను కాన్వెంటు స్కూల్సు (convent schools) లో చదివించటం వచ్చింది. నాకు పర్సనల్ (personal) గా ఇవేమీ ఇష్టంలేదు సుమా! హిందువు లెప్పటికీ హిందువులుగానే ఉండాలి.

శారద—ఫాదర్! మీ రింత ఎడ్యుకేటెడ్ (educated) అయివుండీ ఓల్డు ఆర్థడాక్స్ ఐడియాస్ (old ortho-dox ideas) ఏమీ ఛేంజి (change) కాలేదే!

రామా—అది చిన్నప్పటి ట్రయినింగులో ఉంటుంది. లేదా కొన్ని పరిస్థితులవల్ల మనసు మారి మార్పు రావచ్చును. నేను నాలు గేండ్లనుండీ రిటైరు (retire) రయి నీ కాలేజీ ఎడ్యుకేషన్ కోసం ఇక్కడ సెటలయినప్పటినుండీ నిన్నేమయినా ఇన్‌ఫ్లుయన్సు చేయగలిగానా?

శారద—థేంక్స్ యూ ఆర్ వెరీ గుడ్ టుమీ (Thanks! you are very good to me)

రామా—అయితే అమ్మా! నువ్వు సిగరెట్లు కాల్చడం అభ్యాసం చేసికోలేదు గద! ఇప్పుడు లేడీస్ (ladies) లో అదికూడా ఫాషనే (fashion) కదా!

[శారద వినిపించుకోదు. కారు హారన్ వినబడుతుంది. 'వచ్చి అయింది' అంటూ శారద ఎదురు వెళుతుంది. వేణుగోపాలరావు ప్రవేశం. ఎగ్రిని బ్లేజరు స్పోర్టింగుకోటు. ఫ్లానల్ పాంటు. నీటయిన క్రాపింగు, పొడవైన విగ్రహం. చేతికి రిస్టువాచీ, జేబులో పైకి కన బడుతున్న పువ్వులసిల్కు చేతిరుమాలు. చేతిలో టెన్నిస్ బాటు వయస్సు 22 సంవత్సరాలు]

శారద—గుడ్ ఈవినింగు మిస్టర్ వేణూ! (Good evening Mr. Venu)

వేణు—గుడ్ ఈవినింగ్!

శారద—[తండ్రిని చూసి] ఫాదర్, మిస్టర్ రామారావు, రిటైర్డు ప్రిన్సిపాల్ రాజమండ్రి కాలేజి. [వేణుని తండ్రికి చూపి] మిస్టర్ వేణుగోపాలరావు మై ఫ్రెండ్ [illegible]

షేక్‌హాండు చేసుకొంటారు. అంతా టీపాయి చుట్టూ కుర్చీలమీద కూర్చుంటారు.]

శారద—ఇంత డిలే (Delay) అయిందేమీ!

వేణు—ఏమీ లేదు. ఒక వీక్ (week) నుండీ కొన్ని లెటర్సు (letters) రాదామనుకుంటున్నాను. అట్లాగే డిలే అయిపోయింది. ఇవాళ సడెన్ (sudden)గా జ్ఞాపకంవచ్చి వ్రాస్తూకూర్చున్నాను. అయినా డిలే కాలేదే. ఫోర్ తర్టీకికదా వస్తానన్నాను.

శారద—నో! నో! ఫోర్ ఓ క్లాక్! (Four O' Clock) బ్రదర్! ఒకనాడు మీరు మిస్టర్ వేణూస్ ప్లే (Mr. Venu's play) చూడవలసిందిదా!

రామా—చాలా మంచి ప్లేయరై యుండాలి.

వేణు—మియర్ ఫ్లాటరీ (mere flattery).

రామా—ఆశ్చర్యమేముంది? యంగ్‌మాన్ (young man) మీరు బాగా ఆడగలిగేఉంటారు. మీది నేటివ్ ప్లేస్ క్రిష్ణాడిస్ట్రిక్టా?

వేణు—ప్రస్తుతం మా ఫాదరు హరిపురంలో ఉన్నారు.

రామా—మీ ఫాదరూ... ...వాట్ ఈజ్ హీ? (what is he?)

వేణు—మ్యునిసిపల్ ఛైర్మన్ అండు ప్రొప్రయిటర్ రామా వీవింగు మిల్సు.

రామా—వారి పేరు?

వేణు—శంకరరావుపంతులుగారు.

రామా—ఓ యస్. ఎక్కడో ఎలక్షను రిపోర్టు చూశాను.

వేణు—చాలా కీన్ (keen) ఎలక్షన్ అయింది. ఆయన ఛైయిర్మన్ అయినందుకు నాకు కారు లాభించింది.

శారద—బ్యూటిఫుల్ కార్ బ్రదర్!

[వంటకుర్రవాడు ట్రేతో, టీ, కప్పులు, సాసర్లు తెచ్చిపెడతాడు. శారద ముగ్గురికీ కప్పులు పెట్టి టీ కలిపిస్తుంది. టీ త్రాగుతూ మాట్లాడుతారు.]

రామా—మీ బస యెక్కడ ?

నేను—మైలాపూరులో సిక్స్టీ రుపీస్ కి ఒక యిల్లు తీసుకున్నాను.

రామా—నా గరల్ ఎడ్యుకేషన్ గురించి కాలేజీకి దగ్గరగా ఉండాలని నేనిక్కడ ఈ ఇల్లు తీశాను. నా గరల్, శారద వుమెన్సు కాలేజీలో చదువుతున్నది. పెళ్ళికాకపోతే కాలేజీలో చదువుతా నని పట్టు పట్టింది. మైలాపూరు ప్రాపర్ కాదిది. మీకు కారుకూడా ఉంది. ఈ ట్రిప్లికేన్ చూడండి! ఎంత కంజెస్టడ్! (congested)......మీకు... నెలకి......ఒక...హండ్రెడ్ రుపీజ్ ఖర్చు అవుతుందా?

నేను—ఎక్కడ హండ్రెడ్! టూ హండ్రెడ్ దాటుతుంది. కారుకే అయిపోతుంది హండ్రెడ్ రుపీజ్.

రామా—మీ ఫాదరు చాలా రిచ్ మాన్ (Rich man) అయి ఉండాలి.

నేను—అంతే, ఆయనకి లాటరీలో ఒక ఫార్ట్యూన్ వచ్చింది లెండి! ఆది వేస్టు చెయ్యకుండా బిజినెస్ లో ఇన్వెస్టు చేశారు.

రామా—మంచిదే! క్లవల్ మాన్ (clever man)

శారద—టైమ్ ఈజ్ అప్ (time is up) మనం టెన్నిస్ కు పోవద్దా?

నేను—పోదాం పదా? తమరుకూడా దయచేయండి సార్.

రామా—నాకు టెన్నిస్ అంత ఇంట్రెస్టు లేదు.

నేను—అల్లా ఐతే సికారుకు పోవచ్చును. నా కారుని ఆనర్ (Honour) చెయ్యండి!

రామా—నేను వై. యమ్. సి. యే. (Y. M. C. A) లో మీటింగుకి వెళ్ళాలి. నా స్నేహితు డొకాయన వచ్చి పికప్ చేస్తానన్నాడు. అమ్మా! నీ ఫ్రెండుకి వచ్చీ రాని ట్యూన్సు ఏమైనా? నువ్వు కొత్తగా నేర్చుకుంటున్నా వేమయినా ఒకటి రెండు పాటలు పాడి వినిపిస్తావా?

శారద—[మౌనము.]

నేను—పాడండి! మాకు సంగీతమంటే చాలాసరదా!

శారద—[నవ్వి ఊరుకుంటుంది]

రామా—పాడు అమ్మా! తప్పేమిటి?

[శారద వెళ్ళి, తంబురా తెచ్చి, శృతివేసుకొని ఒకజాతీయ గీతమో త్యాగరాయకీర్తనో పాడుతుంది. పాట పూర్తిఅయ్యాక కారు హారన్ వినబడుతుంది.]

రామా—నా ఫ్రెండు వచ్చేశాడు. నేను వెళ్ళివస్తానూ! శారదా! శీఘ్రంగా తిరిగి వస్తావు కాదూ!

శారద—ఆహా! శీఘ్రంగాదా వస్తును. [రామారావు వెళతాడు]

వేణు—మీ ఫాదరు తెలుగు బాగా మాట్లాడుతారాగే! మీకింత సదర్న్ ఆక్సెంటు (Southern Accent) ఎట్లా వచ్చిందీ?

శారద—మా ఫాదర్ గోదావరి డిస్ట్రిక్టులో చాలాకాలం సర్వీసు చేసినారు. నాకు చిన్నప్పుడే మా మదర్ చనిపోయినదాని చేత నా అంకుల్ (uncle) వాళ్ళను కృష్ణాంగారిదగ్గిరే ఉంటిని. వారు కృష్ణా డిస్ట్రిక్టులో డి. ఎమ్. ఓ. (D. M. O.) గా సర్వీసు చేసినారు.

వేణు—అందుకే మీకు తెలుగు బాగా రాదు.

శారద—ఏమి నేను తెలుంగు బాగా మాట్లాడేది లేదా? రాసేదానికీ చదివేదానికీ బాగా వచ్చేదిలేదు! నా ఎర్లీ ఎడ్యుకేషన్ (Early Education) అంతా కాన్వెంటు స్కూల్సు (Convent-schools) లోదా అయింది.

వేణు-ఇకనేం. అందుకే ఇంత అద్భుతంగా మాట్లాడుతున్నారు.

శారద—మా మదర్ టంగ్ (mother tongue) తెలుంగుదా మేముకూడా అందాలిస్‌దా.

వేణు—తెలుగు చాలా స్వీట్ లాంగ్వేజ్ (sweet language ఇటాలియనే ఆఫ్ ది ఈస్టు అంటారు. కొత్తగా నేర్చుకొంటున్నా మీరు బాగా పాడేరే!

[కొంతసేపు నిశ్శబ్దం. వేణు తనలో తానే కూనిరాగంతో పాడుకుంటాడు.]

శారద—మీకు మీరే పాడుకుంటున్నారే! మేము వినేదానికి కాదా!

వేణు—నా దేమీ నేర్చుకొన్న సంగీతముకాదు. చిన్నప్పుడు టెక్స్టు బుక్కులో చదువుకొన్న పద్యాలేవో కూనిరాగం తీస్తాను.

శారద—పాడండి మీరు! మగవాళ్లుకూడా సిగ్గుపడితే ఎట్లా?

వేణు—[చక్కనిరాగంతో పద్యం చదువుతాడు.]

"వాసనచూడనట్టి ప్రసవంబు, నఖంబుల ద్రుంపనట్టి నూ
త్నాసమపల్లవంబు, పరు లానని క్రొవ్విరి తేనె, సూచివి
న్యాసము లేని రత్నము, మహోతతపుణ్యఫలంబుబోలు నా
భాసురగాత్రి సోయగ మెవండు భుజింప విరించి వ్రాసెనో!"

ఈ పద్య మేమిటో తెలిసిందా మీకు.

శారద—అదేమో! నా కదంతా గ్రీక్ అండు లాటిన్ (Greek and Latin)

వేణు—దుష్యంతుడు శకుంతలని వర్ణించిన పద్య మిది. శకుంతలకి మల్లే మీరుకూడా చాలా అందగా ఉన్నారనీ......

శారద—మీరు నన్ను ఫన్ (Fun) చేస్తున్నారే!

వేణు—ఇకమీదట మీరూ గీరూ అనవద్దు. సింపిల్ (simple) గా వేణూ అంటే నాకు సంతోషం.

శారద—అవును. మనం పార్ట్నర్స్ కదా!

వేణు—ఏదీ, ఒక్క టెన్నిస్ లోనేనా?

శార—నాటీ బాయ్ (Naughty boy) [రిస్టువాచీ చూచి] అరే! గంట అయిదు మించినదే! లెటజ్ రనప్ (Let us run up)

[శారద లోనికి వెళ్లి, టెన్నిస్ బాటు తెస్తుంది. ఇద్దరూ తొందరగా వెళుతూ]

బాయ్! పీడు బద్రం. [వెళతారు]

తెర.



ఓం!

బ్రహ్మకృపాహి కేవలమ్.

# విడాకులా?

## మూడో రంగము



సమయం—సా॥ 5 గంటలు.

[సామశాస్త్రి ఇల్లు: సీతమ్మ ఇల్లు తుడుస్తూవుంటుంది. రత్నం ఏదో పుస్తకం చదువుతూ కూర్చుంటుంది.]

సీతమ్మ—మీ నాన్న ఎలా వెళ్ళాడే? సీమలోకి వెళ్ళిపోయినట్టుగా ఏమిటి?

రత్నం—లేదు. పెరట్లోకి వెళ్ళినట్టుంది.

సీతమ్మ—రోజూ ఈపాటికి వెళ్ళిపోయేవారుగా. ఇవాళ ఇంకా వెళ్ళలేదేమి చెప్మా! అన్నయ్యని ఐదుగంటలకే రమ్మన్నాం కాదటే?

రత్నం—నాన్న ఉండగా అన్నయ్య వస్తాడేమోనే అనుమానం!

సీతమ్మ—అలా అయితే పెద్దరాద్ధాంతసిద్ధాంత మవుతుంది. ఇద్దరూ పట్టుదల మనుష్యులే!

రత్నం—అమ్మా! అన్నయ్య హరిజనవాడలోనే కాపురం పెట్టేడట!

సీతమ్మ—అదే వచ్చిన అల్లరి! ఇంత ఇలాంటిపనులు మానమంటే మానడు. ఈయన ఊరు "వాడా" అల్లరి చేసికొని దండోరా వాయిస్తారు. అసలే సోమయాజి, అందుమీద యజ్ఞం చేశారు.

రత్నం—అన్నయ్య మాదిగవీధు లన్నీ తుడుస్తున్నాడటనే!

సీతమ్మ—ఉస్ ! ఊరుకో !

కామ—[చప్పున ప్రవేశించి] ఏమిటే అమ్మాయి అంటూంది?

సీతమ్మ— ఏమీ లేదు.

కామ—[రత్నంతో] ఏమి టీ అంటున్నావు ?

రత్నం—[తల్లివేపు చూసి ఊరుకుంటుంది].

కామ—నేను విన్నాను లెండి ! వాడు మాదిగవీధులు తుడుస్తున్నాడని మెచ్చుకుంటున్నారా ?

సీతమ్మ—ఇదేమి టండోయి. ఒకమాట కొకమాట విని బుజాలు తడుముకుంటున్నారు.

కామ—మీకు కూడా తెగుళ్లెక్కువవుతున్నాయి. పొండి. మీరు కూడా వాడి వెనకాల పోయి మాదిగవీధులు తుడవండి; పాకీ ముండల్లాగ !

సీతమ్మ—అదే బాగున్నట్టుంది ఆఖరుకి ?

కామ—బాగుంటుంది; కాకుండా మరి ? మిమ్మల్నికూడా ఇంట్లోంచి తగలేస్తేసరి! పాత్రిగా ఏమీ భక్తి లేకుండా వుంది [సులోచనాలూ పొడుంకాయా తీసుకొని వెళతాడు].

సీతమ్మ—[గుమ్మందాకా వెళ్ళి చూచివచ్చి] అమ్మాయీ ! నీకేమాత్రం జ్ఞానం లేకపోతే ఎలాగే? రహస్యంగా అనుకోవాలి కాని ......ఆయన గుమ్మంలో ఉండగా ఊరుకోకూడదూ ? అన్నయ్య నిన్ను తోడబుట్టినదానికంటె ఎక్కువలా చూసుకుంటున్నాడా ? అతని వల్లే ఈ ఉపకారం అవుతుందని నా నమ్మకం ! మధ్యని ఈయన చేసేది ఏమి లేదుగాని మన ప్రయత్నం సాగకుండామాత్రం చేస్తారు. పెరట్లోకి వెళ్ళి వస్తాను ఈలోగా అన్నయ్య వస్తే ఉండమనూ !

[రత్నం పుస్తకం ముడిచి పాడుకుంటుంది.]

యమునా కళ్యాణి — రూపకం.

జయ జయ జయ ప్రియభారత జనయిత్రీ దివ్యధాత్రీ
జయ జయ జయ శతసహస్రనరనారీహృదయ నేత్రీ

1. జయ జయ సశ్యామల సుశ్యామ చలచ్చేలాంచల
జయ వసంతకుసుమలతా చలిత లలిత చూర్ణకుంతల
2. జయ మదీయహృదయాశయ లాక్షారుణపదయుగళా
జయ దిశాంతగత శకుంతదివ్యగాన పరితోషణా—(శ్రీకృష్ణశాస్త్రి)
[ప్రకాశం ప్రవేశించి] నాన్న ఉన్నారా యింట్లో?
రత్నం—లేరు. ఇప్పుడే వీధిలోకి వెళ్లారు.
ప్రకా—అమ్మేదీ!
రత్నం—పెరట్లోకి వెళ్ళింది. వస్తుంది కూర్చో అన్నయ్యా!
ప్రకా—[కూర్చొని] ఏమి టమ్మా పాడుతున్నావు.
రత్నం—ఏదో పాడుకుంటున్నానుగాని నాకో గాంధీపాట నేర్పవు అన్నయ్యా!
ప్రకా—ఓ కావలసినన్ని పాటలు, హిందీపాట చెప్పేదా? ఈ పాట విను. బాగుంటే రాసుకుందువుగాని.

[ప్రకాశం పాడతాడు].

(ఖవాలీ వరుస.)

గాంధీ, తు, అజ, హింద్, కీ, ఏకమాన బన్ గయా।
సారీ మనుష్యజాతికా అభిమాన బన్ గయా।
తు, సత్య, అహింసా, దయా, నిస్వార్థత్యాగసే।
ఇస ఆజ, మర్త్యలోకమే భగవాన బన్ గయా।
తేరీనసీహతోంమే, నహుంజానహానికా అసర్ హై।
తుకోలగీహవా తేరీ ఇన్సాన బన్ గయా।
జిస దోస్తహై హరకౌమకా, హరదిల్ అజీజహై।
సారాజహాన తేరా కదరదాన బన్ గయా॥
సీతమ్మ—[ప్రవేశించి] వచ్చేవా నాయనా! నువ్వింట్లో అడుగు పెడితే చాలోయి ఇల్లంతా కళకళ్లాడుతుంది.
ప్రకా—పిన్నీ! నాన్న ఇంట్లో అడుగు పెట్టవద్దని నిషేధించడం, మీరు నన్ను చూసికే మొగమాటపెట్టడం, ఆయన లేనప్పుడు దొంగలాగ నేను ఇంట్లో ప్రవేశించడం, ఇదంతా నా మనస్సుని

చాలా వేధిస్తూందమ్మా! ఆయన ఉన్నప్పుడు వస్తేనే బాగుండు నేమో!

సీతమ్మ—నిజమేనోయ్! కాని దెబ్బలాటలూ జగడాలే మిగులు-అన్నట్టు అతనిదగ్గరనుంచి ఏమయినా జవాబు వచ్చిందా?

ప్రకా—అసలు నేను వ్రాయనే లేదు ఈ విషయంలో చాలా చిక్కు లున్నట్టున్నాయి. అసలు తండ్రి కేమి పెత్తన మున్నట్లు లేదు. అంతా వేణుఇష్టంమీదే ఉన్నట్లుంది.

సీతమ్మ—ఏమో! మరేం చేస్తావో! దీనిభారమంతా నీ మీద పెట్టాను. తండ్రితరువాత తండ్రింతవాడివి. నన్ను అరమర లేకుండా కన్నతల్లిలాగు చూసుకుంటున్నావు. నీకన్న ఎవ రున్నారు చెప్పు దాని కాపురం నిలబెట్టి అది సుఖపడకపోతే నా కెందు కీ బతుకు? దాన్ని తప్పించి మరో పిల్లా ఫిచికా ఉన్నారు గనుకనా?

ప్రకా—గట్టిచిక్కు తెచ్చిపెట్టావమ్మా! ఏమీ పాలుపోకుండా ఉంది. ఏ ప్రయత్నం చెయ్యడానికీ వీలు లేకుండా నాన్న తుదముట్టా తెంచుకు వచ్చేశారు. వాళ్లేమో ధనబలంచేత మదాంధులై ఉన్నారు. వాళ్లతో పలుకుబడి ఉన్నా వాళ్లు చెయ్యవలసినపనిగాని, మనస్సు కరిగించి మంచిమీద పని జరపడం కష్టం.

సీతమ్మ—[కంట తడిపెట్టి] నువ్వలాగంటే ఎలాగ అబ్బాయీ! ఈపిల్ల నింట్లోపెట్టుకొని ఎలాభరించను? ఇన్నాళ్లూ డబ్బంటే వేలూ లక్షలూ లేదుకాని, పరువుకీ ప్రతిష్ఠకీ లోటు లేకుండా గుట్టుగా కాలక్షేపం చేస్తున్నామా? ఈ యీడుపిల్ల కాపరానికి చెడి ఇంట్లో ఉందంటే వచ్చేవాదులూ, సాధక బాధకాలూ నీకు తెలియనివికావు. ఫలాని కుటుంబంలోపిల్ల ఫలానివారి చెల్లెలూ అని పేరు తెచ్చుకుంది. చదువుకున్నవాడివి. బుద్ధిమంతుడివి. నీకు నేను సలహాచెప్పేపాటి దాన్ని కానుగదా! నీ చేతుల్లో పెట్టాను. పాలముంచినా, నీళ్ల ముంచినా నీదేభారం. [కంట తడి]

ప్రకా—చెల్లెమ్మా! నీ ఊహ ఏమిట్లో చెప్పు. నువ్వు ఎలాగ చెయ్యమంటే అలాగ చేసాను.

రత్నం—బాగానే ఉంది. నా కేం తెలుస్తుంది?

ప్రకా—అది కాదమ్మా రత్నం మీ మామగారితో మాట్లాడ మన్నావా? లేక వేణుతోనే మాట్లాడితే—

రత్నం—బాగానే ఉంది. న న్నడుగుతా వేమిటి ?

సీతమ్మ—అబ్బాయీ! దాన్ని అడిగితే అదేం చెపుతుంది? ఎలాగయినా దానికాపరం నిలబెట్టి, దాన్ని ఒకయింటిదాన్ని చేయడమే దానికి కావలసింది.

ప్రకా—ఒక వేళ మళ్ళా పెళ్లిచేసుకోడానికి ప్రియత్నిస్తున్నాడేమో ?

సీతమ్మ—అందుకే నువ్వేప్రయత్నం చేసినా ఆలస్యం కాకుండా చెయ్యాలి.

ప్రకా—నాకు ఒక్కఆలోచన తోస్తూంది.

సీతమ్మ—[ప్రకాశం చెయ్యి పట్టుకొని] ఏమిటో చెప్పు నాయినా! ఇదిగో! నువ్వు ఏమి చెయ్యమన్నా సిద్ధం. పదీపాతిగా కర్చవతాయన్నా ఎలాగో ఇచ్చుకుంటాను.

ప్రకా—అతను యిప్పుడు బాగా ధనవంతుడు. చెన్నపట్నంలో చదువుతున్నాడు. దొరలపద్ధతులన్నీ అలవాటయిఉంటాయి. సహజంగా ఇంగ్లీషు చదువుతున్న పిల్లమీాదికి బుద్ధిపరుగెడుతూ ఉంటుంది. అందుచేత చెల్లెమ్మకి మరి రెండు క్లాసులు ఇంగ్లీషు చెప్పిస్తే అతనిబుద్ధి మారుతుం దనుకొంటాను.

సీతమ్మ—మరి అయితే ఏం చేదాం ?

ప్రకా—శారదాని కేతనంలో అప్పచెబితేనో ?

సీతమ్మ—అదెక్కడ ?

ప్రకాశం—గుంటూరిలో ఉంది. మా కాంగ్రెసువాళ్ళే ఆ సంస్థ నడుపుతున్నారు. కేవలం జాతీయవిద్యా సంస్థ.

సీతమ్మ—నీ యిష్టమే ! న న్నేమీా అడగక్కరలేదు.

ప్రకా—నాన్న ఒప్పుకోవద్దా ?

సీతమ్మ—మీనాన్న ఒప్పుకోనేదేమి టబ్బాయీ! తనచేతి డబ్బు వదలకపోతే ఎవ రెలాపోయినా మీనాన్న కక్కుర లేదు. చెట్టంత కొడుకువి. ఇహపరాలకి పనికివచ్చేవాడివి. నిన్ను ఇంట్లోంచి తగిలేసిన తండ్రికే, కూతురు చదువుకోడానికి వెళితే బెంగేమిటి ? నువ్వు చదువు కోసం కాశీ వెళ్ళినప్పుడేం చేశాకు? తనచేతిడబ్బు మిగిలిందని సంతో షించారుకారూ ? కాక పోతే కాస్త చిర్రుబుర్రు మంటారు. ఎలాగో సమాధానపడుచుకొంటాను. చూడూ! కావలిస్తే నాలుగో అయిదో కర్చుకు కూడా పంపుతాను.

ప్రకా—ఆ విషయంలో ఏమీ బెంగ లేదు. భోజనవసతులకి ఏదో విధంగా ఉచితంగానే ఏర్పాటు చేయిస్తాను.

సీతమ్మ—తీరా ఇంతా చేస్తే ఈలోపున అతడు పెళ్ళిచేసికొని దీనిని చేరదీయకపోతే ?

ప్రకా—అందుకు నే నేమి ఆలోచించానంటే, నేనుకూడా చెన్నపట్నం వెళ్ళి ఏదోఉపాయం చేదామని. బావ నన్ను చూచి సేన్నాళ్లయింది. వెంటనే పోల్చలేడని ధైర్యం.

సీతమ్మ—నాతండ్రీ, నానాయనే, అంతకంటేనా? నా చర్మం చెప్పులు కుట్టిఇచ్చి నీ ఋణం తీర్చుకుంటాను. చూశావా అమ్మాయీ! అన్నయ్యకి నీమీద ఎంత అభిమానమో! స్వతహాగా అతనిబుద్ధి మంచిది, పైగా గాంధీమహాత్ముని శిష్యుడు.

ప్రకా—ఒకవేళ నాప్రయత్నం సఫలం కాదనుకోండి! కీడెంచి మేలెంచ మన్నాడు. రత్నం వెళ్ళీ చదువుకోవడంవల్ల నష్ట మేముంది ?

రత్నం—అన్నయ్య ఆలోచనే బాగుందే అమ్మా! నాకు కూడా చదువుమీదే ఉంది.

సీతమ్మ—మరి, నాయనా, ఎల్లుండి అమావాస్య వెళ్ళిన విదియనాడు దీన్ని ఆరుగంటలరైలుకి నేను దిగబెడతాను. నువ్వు కూడా ఆ రైలుకే బయలుదేరు. ఏం? దీన్ని గుంటూరిలో చదువులో

ప్రవేశపెట్టి నువ్వలాగ చెన్నాపట్నం వెళ్ళిపో. ఏం? అన్నట్టు నీకు చెన్నాపట్నంలో కాలక్షేప మెలాగ ?

ప్రకా—ఏదో తంటాలు పడతాను. ఏ పత్రికాకార్యాలయం లో నైనా ప్రవేశిస్తాను. ఏదీ లేకపోతే నలుగురికి హిందీపాఠాలు చెప్పుకొంటే నా పొట్ట గడిచిపోతుంది.

సీతమ్మ—ఇంకొక్కమాట చెప్పు ! నువ్వు కోపం తెచ్చుకోకమ్మా! ఎప్పుడైనా నీకు అయిదు పదీ కావాలంటే నాకు కబురందేలాగు చేస్తివా పంపిస్తాను.

ప్రకా—అదేమీ అక్కరలేదు కాని రేపు వెళ్లడానికి రైలు ఖర్చులు మాత్రం ఇవ్వాలి... అసలు వ్యవధిలేకుండా పెట్టావుకద ప్రయాణం !

సీతమ్మ—ఏమి నాయనా ! నీ కేమయినా తొందర పనులున్నాయా ?

ప్రకా—తొందరపనులంటే ఇక్కడ హరిజనులకి ఒక పాఠశాల పెట్టాను. దాని నెవరికైవా అప్పగించకుండా వెళ్ళిపోతే అది పాడవుతుంది. సరే చూదాం. అన్నిటికన్న ఇదే ముఖ్యమయిన పనిగా భావించుకొంటాను.

సీతమ్మ—అదే పదివేలు, ఇంకొక్కమాట.

[తలుపు తోసుకొని కామశాస్త్రి ప్రవేశం.]

కామ—ఏమిటరా్రి చేస్తున్నారూ ? [ప్రకాశంను చూసి నిర్ఘాంతపోయి] ఈ పాకీవెధవ నెందుకు రానిచ్చారు ఇంట్లోకి ?

సీతమ్మ—బాగానే ఉన్నాయి మాటలు. ఆ దారంట వెళుతూంటే పిలిచి ఏదో లోకాభిరామాయణం చెప్పుకుంటున్నాం.

కామ—ఈ యిల్లంతా అపవిత్రంచేసి మాలకూడు చేశావు కాని ఇంకేమయినా ఉంచావా? వా డంటే సిగ్గులేక వచ్చాడు కాని నీ కేం సిగ్గులేకపోయిందే?

ప్రకా—ఈ విషయంలో నేను సిగ్గుపడడానికి బదులుగా గర్విస్తున్నాను. పాకీవాడని పిలవడం నాకు కితాబు. నిజ మాలోచిస్తే

ఆదర్శప్రాయుడైన పాకీవాడు బ్రాహ్మడికంటే ఉత్తముడు. [బ్రాహ్మడు లేకపోయినా పాకీవాడు బ్రతకగలడు కాని పాకీవాడు లేకపోతే బ్రాహ్మడు బ్రతకలేడు. తల్లి బిడ్డకు చాకిరీ చేసినట్లు పాకీవాడు సంఘమంతటికీ సేవ చేస్తున్నాడు.

కామ—ఛీ! నాతో మాట్లాడకు. నా మొహం చూడడానికీ నాతో మాట్లాడడానికీ నీ కర్హతఉందీ? బ్రాహ్మణపుట్టుకపుట్టలేదూ? బ్రాహ్మడికంటె పాకీవాడు ఉత్తము డంటావురా?

ప్రకా—క్షమించాలి! సెలవు. [వెళతాడు]

కామ—పింజారీముండా! పాకీచీపురుపట్టుకొని మాదిగవీధులన్నీ తడుస్తూ వాళ్లని కౌగిలించుకు తిరుగుతూంటే వాడి నేమని యింటికి పిలిచావే? వాడికి ఘోరవాది నరకాలుతప్ప ఇంక గతు లున్నాయా? పాకీవాడు బ్రాహ్మడికంటె ఉత్తము డంటాడు! వీడి సాహసం!

రత్నం—హరిజనులు మనలాంటి మనుష్యులు కారూ నాన్నా! వాళ్లకీ మనలాగే రక్తమాంసాలూ ఆత్మా ఒకటేనా? ఇంట్లో పెంచుకొనే పశువులపాటీ చేశారుకారా వాళ్ళు?

కామ—నీ బుర్రకీ ఎక్కించాడూ ఈవేదాంతం? ఏడిశావు పద! ఇద్దరూ వెళ్ళి నాలుగుబిందెల నీళ్ళు తోడి తెచ్చి ఇంత గోమయం కలిపి వాడు కూర్చున్న సావిడి, వీధిగుమ్మం కడిగేసి శుద్ధిచెయ్యండి. లేవరేం!......నా మడిగావంచా ఉందా [అంటూ పెరట్లోకి వెళతాడు].

సీతమ్మ—వెర్రి కుదిరింది-రోకలి తలకి చుట్టమన్నాడట. ఇలాంటి మనిషితో ఎలా వేగడం! రావే అమ్మాయీ! రెండు బిందెల నీళ్లేనా దిమ్మరిస్తేగాని మనల్ని రానీ రంపాన పెడతాడు.

[ఇద్దరూ వెళతారు]

తెర.



ఓం!

ఋషిమ్మత్కృపాహి కేవలమ్.

# విడాకులా?



## నాలుగో రంగము

సమయం ఉదయం 10 గంటలు.

[రామారావు ఇల్లు. రామారావు కుర్చీలో కూర్చొని ఉత్తరం చదువుతూ ఉంటాడు.]

రామా—అమ్మా! శారదా!......శారదా! [శారద ప్రవేశం] కూర్చోవమ్మా! ఈ ఉత్తరం చూడు!

శారద—[ఉత్తరం చదువుతూండగా ఆశ్చర్యం, విచారం ముఖంలో కనబడతాయి. తండ్రివేపు అప్పుడప్పుడు చూస్తూఉంటుంది. ఉత్తరం చదువుకొని మడిచి బల్లమీద పెట్టేస్తుంది. ముఖం అరచేతులో పెట్టుకొని ఆలోచనాయత్తయై కూర్చుంటుంది.]

రామా—ఏవమ్మా! అట్లాగున్నావేమీ? [శారద జవాబు చెప్పదు] శారదా! చూడు నాకేసి చూడూ కండ్లంట నీళ్లొస్తున్నాయేమీ?

శారద—[ముఖం వంచుకొని] ఒకటి లేదు.

రామా—అబ్బ! మూర్ఖపుపట్టు పట్టకూడదు సుమీ! నీ వుద్దేశం ఏమిటో చెప్పకూడదూ!

శారద—ఇంతకంటె డిస్గ్రేస (Disgrace) ఏముంది!

రామా—[రోషంతో] ఏమిటే!

శారద—నన్ను మీా రిట్లా ఇన్సల్టు (insult) చేస్తా రనుకో లేదు.

రామా—దీనిలో ఇన్సల్టు కేముందో చెప్పు।

శారద—నాతో కన్సల్టు (consult) చేయకుండా నామూరేజి (marriage ) మీారు సెటల్ (settle) చేసేది ఇన్సల్టు కాదా?

రామా—కుమార్తె పెండ్లి తండ్రి సెటల్ చేయడం ఇన్సల్టా? ఇంత కాలం చదువుచెప్పించి పెద్దదానిని చేసి పోషించిన తండ్రి కూతురుపెండ్లి సెటల్ చేయడానికి అన్‌ఫిట్ ( unfit ) అన్నమాట!

శారద—ఫిట్ ( fit )అన్‌ఫిట్ ఇప్పుడు క్వశ్చెన్ (question) కాదు. స్త్రీలైఫ్‌లో మూరేజి ఒకపెద్ద ఛేంజి (change). ఇంత ఇంపోర్టెంటు (important) ఛేంజి క్రియేటు (create) చేసేటప్పుడు, నా ఒపినియన్ లేకుండా, నన్ను ఇగ్నోర్ (Ignore) చేసి, నేను బ్రతికి వున్నానా, చచ్చినానా అని విచారించకపోతే ఎట్లా?

రామా—దీనిలో నీ వంత ఫీలు అవడాని కేమీా లేదమ్మా! వేణు చాల్లా రిచ్‌మాన్, మంచి స్పోర్ట్సుమన్ (sportsman) అని పొగుడుతూ నువ్వే ఇంట్రడ్యూస్ చేశావా? నీకు ఇష్టమైన మనిషితోనే కరస్పాండు చేసి అరేంజి (arrange) చేశాను కాని ఎవరో చదువుసంధ్య లేని పల్లెటూరి పాపర్‌ని తీసుకురాలేదే! తగిన యీడుంది; ఎడ్యుకేషన్ వుంది; వెల్తు (weatlh) వుంది. అతని ఫాదర్ మంచి పొజిషన్‌లో వున్నాడు; వేణు నీ క్లాస్ మేటు, స్నేహితుడు. అన్ని కండిషన్సూ బాగావున్నాయని ఆలోచించి చేశాను. అది నీకు ఇన్సల్టుకాదు.

శారద—నేను వేణుని మూరేజి చేసుకుంటానని చెప్పినానా మీాతో!

రామా—నువ్వట్లాగు చెప్పలేదుగనుకనే, నీ యిష్టం పొంది మరీ పంపిద్దామనే ముందుగా నీకీ ఉత్తరం చూపించాను.

శారద—మూరేజి, ప్యూర్లీ పర్సనల్ అఫైర్ ( purely personal affair)

రామా—అనగా, దానిలో నేను జోక్యం చేసుకోకూడ దంటావా?

శారద—న్యా ఫ్యూచర్ మీరు నిశ్చయించినారే అది నాకు నూటు అగునో లేదో మీరు ఆలోచించినారా?

రామా—నాకు అర్థం కాలేదు.

శారద—నాకు - ఒక మగవానికి స్లేవునై వుండేది యిష్టం లేదండీ! మన దేశంలో మేల్ సుప్రిమెసీ (male supremacy) ఉన్నంత కాలమూ, ఆడదానిమీద మగవాని కధికారము ఉన్నంత కాలమూ, అడదానికంటె మగవానికి లా ప్రకారమూ, ఆచారం ప్రకారమూ, ఎక్కువ హక్కు లున్నంతకాలమూ, ఫ్రీడమ్ పోయి యింట్లో వంటగదే ప్రపంచంగా చేసేమారేజీ చేసుకోనేదిదా నా కిష్టం లేదు.

రామా—వేణుగోపాలరావు, నీ సౌఖ్యానికీ స్వేచ్ఛకీ వలోపమూ రాకుండా చాలా గౌరవంగా ఆదరిస్తానని పదిసార్లు నాతో చెప్పడంచేతనే నే నంగీకరించాను. కొంతకాలం చదువుకొన్నాక మారేజి చేదామని నిన్ను ఇంతకాలమూ ఉంచి వేయడమే ముప్పు వచ్చింది. నువ్వుకూడా ఇదివరకు ఎన్ని సార్లు ఈప్రస్తావన తెచ్చినా, బి. యే పరిక్షలయినాక ఆలోచిద్దామన లేదూ? నీతల్లి చనిపోబట్టికాని, నీతల్లే వుంటే నీకు చాలాకాలం క్రిందటే మారేజి అయివుండేది.

శారద—మా మదర్ వుంటే న న్నడగకుండా అరేంజి చేసే వుండదు. ఆమె చనిపోయింది నాకు చిక్కు వచ్చింది.

రామా—సరె నేనేకదా ఇప్పుడు చెడ్డవాడనయేను. [కొంత సేపు నిశ్శబ్దం] పెండ్లిలేకుండా స్త్రీ వుండిపోవడం ప్రకృతిని ధిక్కరించడంకాదూ? సృష్టి సాగడానికి స్త్రీలు పురుషులు ఆవశ్యకమే. రస్కినే ఏమన్నాడు? వన్ కంప్లీట్సు దీ అదర్ (one completes the other) అన్నాడు. ఇద్దరూ కలిస్తే కాని పూర్ణాంగం కానేకాదు. పురుషులకి పురుషులూ, స్త్రీలకు స్త్రీలూ వివాహం మానేస్తే సృష్టి అంతరిసుంది.

శారద—నావంటివారు కొందరు, మారేజి మాని, స్త్రీసంఘం బాగుపడేదానికి లైఫ్ సేక్రిఫైస్ చేసి పనిచేస్తే క్రియేషన్ ఆగిపోవునా? పురుషులలో, దయానంద సరస్వతి, శంకరాచార్యులు, లార్డు మెకాలే, సర్ ఐసక్‌న్యూటన్, విలియమ్ పిట్ వీండ్లంతా, మారేజి విడిచిపెట్టి ఎంతో దేశసేవ చేయలేదా? పురుషుల ఆంగిల్ ఆఫ్ విజన్ (angle of vision) మారిపోవలె, స్త్రీల అభివృద్ధికిట్లా అడ్డు పెట్టకుండా, వాళ్లను స్వేచ్ఛగా విడిచిపెడితేధా వాండ్లు మంచి పనులు చేస్తురు.

రామా—స్త్రీ పురుషులను భగవంతుడు ప్రత్యేకకార్యాల కొరకు సృజించాడమ్మా! అందుచేతనే వారి శరీరనిర్మాణంలోనే భేదం వుంది. పురుషుడు ధనార్జనచేసి పోషణభారం వహిస్తాడు. స్త్రీ కుటుంబగౌరవం నిలబెట్టి సంసారం చక్కబెడుతుంది. పురుషుడు బీజం; స్త్రీ క్షేత్రం; ఇదే సృష్టిరహస్యం.

శారద—అంటే, ఆడది చలనంలేక మొద్దువలె పడి ఉండవలసిన వస్తువుకాపూ? మగవాడు ఆడజాని మీద అధికారం చలాయించేదానికీ, ఆడది మగవాడికి బానిసగా వుండేదానికే సృష్టి చేసినారా?

రామా—ఆమాట ఎవరన్నారు? పురాణాలలోకూడా స్త్రీలకు చాలా గౌరవ మిచ్చారు. లక్ష్మి విష్ణువుహృదయాన నివసించింది. శివుడు సగం శరీరమిచ్చి అర్ధనారీశ్వరుడయాడు. దక్షయజ్ఞంలో పార్వతి నశిస్తే ఆమెకోసం సన్యాసయి దిగంబరు డయాడు. గంగని నెత్తిమీద పెట్టుకున్నాడు. విష్ణుపురాణంలో ఏమన్నారో విన్నావా?

సీ. పురుషుడు విష్ణువు, పొలతి శ్రీలక్ష్మియా
పురుషు డాలోచన, పొలతి భావ
పురుషుడు ధైర్యంబు, పొలతి యా శాంతంబు
పురుషుడు మంత్రంబు, పొలతి పలుకు
పురుషుడు స్తంభంబు, పొలతి పతాకంబు
పురుషుడు సూర్యుండు, పొలతి కాంతి

పురుషుడు వృక్షంబు, పొలతి ఫలం బౌను
 పురుషుడు జలధియగా, పొలతి యొడ్డు
పురుషుడు తుపాను, మార్గంబు పొలతి సుమ్ము
పురుషుడు రచయిత, రచన పొలతి సుమ్ము
పురుషుడు దినంబు, రాత్రియగు పొలతి సుమ్ము
పురుషు డగ్నియై భాసిల్లు పొలతి సమిధ!

దీనిలో స్త్రీకి వచ్చిన అగౌరవ మేమి టమ్మా? పురుషుడు స్త్రీ మూలంగానె రాణిస్తాడనీ, స్త్రీ లేని పురుషుని బ్రతుకు ఉత్తవ్యర్థమనీ తెలిందా?

శారద—దానిలో ఒక్క మాట అంటి రే! పురుషు డగ్ని, స్త్రీ సమిధ అని; అది ఒక్కటీ చాలు. పోజిషనంతా క్లియర్ చేసింది. పురుషుడు స్త్రీని కాల్చుకొని తింటాడన్నమాట!

రామా—వెర్రితల్లీ! ఇదా అర్థంచేసుకొన్నావు. ఇంధనం వలన అగ్ని పుడుతుంది. అగ్నికి ఆధారం ఇంధనం. అట్లాగే సృష్టి కంతటికీ ఆధారం స్త్రీశక్తి. స్త్రీని ముఖ్యంగా మాతృత్వం కోసమే సృజించాడమ్మా! స్త్రీనిర్మాణంలో ప్రతీఅంశమూ మాతృత్వంకోసమే ఉద్దేశింపబడింది. చక్కగా సంసారం చేసుకోవాలి. దేశాన్ని ఉద్ధరించే పిల్లలని కనాలి... ... ...

శారద—ఔను! మగవాడిపోకులకీ, సరసాలకీ ఉపయోగించే ఆటబొమ్మకావలె; పిల్లలను కనిపెంచే మెషీన్‌గా తయారు కావలె; నోరెత్తకుండా ఇంప్లిసిట్ ఒబీడియన్సు (implicit obedience) చూపించవలె; వంటగదికి అంటుకొనిపోయి ప్రపంచం తెలియకుండా ఉండవలె!

రామా—ఆరోజులు గడచిపోయాయి కాదటమ్మా! నువ్వు బి. ఏ. చదువుకుంటానంటే అడ్డుపెట్టానా? మగపిల్లలతో కలిసి ప్రెసిడెన్సీకాలేజీలో చదువుకుంటానంటే నేను అడ్డుపెట్టానా? నువ్వు టెన్నిస్ ఆడడానికీ, నీ ఇష్టము వచ్చిన డ్రెస్సు వేసుకోడానికీ నేను

అడ్డుపెట్టానా? ఈ ఒక్క విషయంలో నామాట వింటే నే నెంత సంతోషిద్దును?

శారద—దానంతకీ నేను చాలా గ్రేటుఫుల్ (grateful).

రామా—అయితే ఏమిలాభం! ముఖ్యమయిన విషయంలో నాకు వ్యతిరేకమయావు. ఇప్పు డెంతమంది స్త్రీలు సినీమాల్లో ఆక్టు చేయలేదు? స్పోర్ట్సులో ఛాంపియన్ షిప్ తేలేదు? మ్యునిసిపాలిటీల లోను, లెజిస్లేటివుకౌన్సిల్సులోనూ మెంబర్లుకాలేదు? వీ రంతా పెండ్లి మానుకొన్నారా? పెండ్లి చేసుకుంటేమాత్రం ఇవన్నీ చేయ కూడదా! ప్రకృతికి విరుద్ధమయినపని ఎన్నాళ్లు సాగుతుంది చెప్పమ్మా!

శారద—[ఆలోచనలో పడుతుంది] నాకు మారేజి మానేసి వుమేన్ మువ్ మెంటులో వర్కు చేదామని ఉంది. దానికిదా యిప్పుడు చాలా లిటరేచర్ చదువుతున్నాను. మారేజి చేసికొని, ఒక మగ వాని విమ్సు (whims)కు లోబడి, సంసారం చేస్తూఉంటే ఇదంతా సాగునా? నాకు గ్రేట్ ఫ్యూచర్ (great future) ఉందనుకొన్నాను. పై దేశాలుపోయి కాంటినెంటల్ ఫేమ్ (continental fame) సంపా దించాలని పెద్ద పెద్ద హోప్సు పెట్టుకొని ఉన్నాను; నా హోప్సు అంతా ఫ్రస్ట్రేట్ (frustrate) చేసి, నా ఎన్ థూజియాజమ్ (enthusiasm) కూల్ డౌన్ (cool down) చేస్తా రనుకోలేదు. ఐ థాట్ యూ వర్ ఎనైడియల్ ఫాదర్! (I thought you were an ideal father) [కంటనీరు తెచ్చుకొని దుఃఖిస్తుంది.]

రామా—[వేళ్లతో నుదుటిమీద కొట్టుకొని] నేను నీకు తండ్రి నవడం ఒక తప్పయింది... ... ... ... ... ... ...అమ్మాయీ! నీకంటె నాకు కావలసిన వాళ్లెవరైనా ఉన్నారా చెప్పు. [శారద జాలిగా తండ్రికళ్లల్లోకి చూస్తుంది] నీకంటె నాకేమయినా ఎక్కువ ఇంటరెస్టు ఉందా ప్రపంచంలో! ఈ యిల్లు నీకోసమేనా కొన్నాను. నా భీమా ధనం పదివేలూ నీపేరనే ఎసైన్ చేశానా? నా పెన్షన్ కూడా కమ్యూట్ చేసి నీవశం చేస్తానన్నాను. నువ్వు సుఖంగా యింటిపట్టున ఉండవమ్మా! నా ఓల్డు ఏజి (old age) లో, నాకు ముఖ్యాధార

మయిన నువ్వు, యీపనంతా పెట్టుకొని దేశాలంట తిరుగుతూంటే, నాకు ఏమిటిగతి చెప్పూ! నే నెవరిమీద ఆధార పడేది? నాకు భార్యా వుండి యింకాపిల్లలు ఉంటే నీవు కోరినట్లు స్వేచ్ఛగా విడిచిపెట్టే వాడి నే!

శారద—[జవాబు లేకుండా దీర్ఘాలోచనలో పడుతుంది].

రామా—నీకు ఇంటర్నేషనల్ ఫేమ్ వస్తుందంటే నాకు అయిష్టమూ? వృద్ధాప్యంలో మరొకదిక్కు లేనప్పుడు నీతండ్రిని కనిపెట్టు కొనివుండడం ఒకడ్యూటీ అని నీవంటి ఎడ్యుకేటెడ్ గర్ల్‌కి చెప్పాలా? చక్కగా సంసారం చేసుకొని, నాకు మనుమలు మనుమరాళ్లచేత ఆనందం కలిగించి, నాప్రాణం కాస్తా హరీ అన్న తరువాత నీయిష్ట మయిన దేశసేవకు దిగు! అదీ నా కోరిక.

శారద—ఈ లైఫ్‌లో పడితే ఆ లైఫ్ వట్టిది.

రామా—నే నింక నీతో వాదించవలసిన దేదీ లేదమ్మా! నీ ఓల్డు ఫాదరుని, అతని వృద్ధాప్యంలో కనిపెట్టవలసిన డ్యూటీ నీవు ఫీలయితే నేను కోరినట్లు చేయి; లేదా? నాయిష్టం నాది, నాకూ ఫాదరుకీ సంబంధం ఏమిటి అనుకుంటే నీయిష్టం వచ్చినట్లు చేయి— నా ఫ్యూచర్ నా గతీ యింతే అనుకుంటాను; ఎప్పుడో ఒకనాడు విరక్తిపుట్టి సన్యాసమైనా పుచ్చుకుంటాను, ఆత్మహత్యయినా చేసు కుంటాను. బ్రతుకుమీద ఉత్సాహం, ఆశా లేకపోయిన తరువాత ఏ మయితే నేమి?

శారద—[గద్గదంతో తండ్రిచేతులు పట్టుకొని] మీరు నన్ను క్షమించవలె; నా మూలంగా మీ కంత కష్టం వద్దు; నా ఫ్యూచర్ యింతేకదా అనుకుంటాను. నేను పెద్ద చదువు చదివి ఉండీకూడా చదువులేని పల్లెటూరిపిల్లగతిదా నాకు పట్టిం దనుకుంటాను.

రామా—నీమాటలు చాలా కష్టంగా వస్తున్నాయి. నీమనస్సు సమాధానపడితేనే నేను కోరినట్లు చేయి. బలవంతంమీద నన్ను సంతుష్టిపరచడానికి నువ్వు పెండ్లిచేసికొన్నా అది సార్థకంలోకి రాదు

శార—హిందూమారేజి సిష్టమంత అన్యాయమయినది ప్రపంచంలో ఎక్కడయినా వున్నదా? దాని ప్రకారం స్త్రీ వట్టి స్లేవు కాదా?

రామా—హిందూవివాహంలో ఆధ్యాత్మికార్థం వుంది. మనస్సులనీ హృదయాలనీ ప్రేమసూత్రంతో ఏకంచేసేది హిందూ వివాహం. దాని వుద్దేశం కేవలం శరీరసౌఖ్యమే కాదమ్మా!

శారద—అవును! దానిలో పురుషుని అధికారం బాగా సేఫ్ గార్డు చేసినారు. ఏ పురాణం చూసినా పతివ్రతాధర్మందా చెప్పను. మగవాడు ఒక స్త్రీకి కట్టుబడియుండవలెననే రూలు లేదు. ఈ పురాణాలు, ధర్మసూత్రాలు మగవాండ్లు వ్రాసిన వేనా? స్త్రీ వ్రాసిన దొకటయినా ఉన్నదా?

రామా—అదేమన్నమాట! రామాయణంలో ఆదర్శప్రాయుడయిన ఏకపత్నీవ్రతస్థుణ్ని రాముడిని చూపించలేదూ!

శారద—సీతని అనుమానంపడి అగ్నిలో పడమనలేదా! రాముడు? సీతకుకూడా తనమీద అట్టె అనుమానమే ఉంచవచ్చును గదా అని తా నొకసారి అగ్నిప్రవేశం చేయకూడదా? ఆడ దనగానే లోకువా?

రామా—ఎందుకమ్మా అనవసరమైన వాదన? నా ఉద్దేశం స్పష్టం చేశాను. నా కోరిక ను వ్యంగీకరించా వనుకుంటున్నాను. నీకు హిందూవివాహపద్ధతి ఇష్టం లేకపోతే నీయిష్టం వచ్చిన పద్ధతి చెప్పు, నేను ఒప్పుకుంటాను. ఎట్లాగయినా నువ్వు సుఖంగా ఉండడమే నాకు కావలసింది.

శారద—మీ రంత కంపెల్ (compell) చేస్తూన్నందుకు మీ మనస్సుకు ఎందుకుదా కష్టం చేయవలె? సివిల్ మారేజి అష్ట మీకు యిష్టందానే! హిందూ మారేజిసిస్టంలో వున్నంత స్లేవరీ (slavery) దానిలో లేదు.

రామా—కానీవమ్మా! నాది మూర్ఖపుపట్టనుకున్నా వేమిటి? నీయిష్టంవచ్చిన పద్ధతికి నేను ఒప్పుకుంటాను. ఇక మరేమీ అభ్యంతరం లేదుకదా! ఈ వుత్తరం వేణుకి పంపివేయవచ్చునా?

కర్రి, కళ్లజోడు ధరిస్తాడు. వచ్చి ఒక కుర్చీమీద కూర్చుంటాడు. అతడు రాగానే పద్మనాభం ఒకసారి లేచి మళ్లా కూర్చుంటాడు.]

శంకర—ఎంతసేపాయి వచ్చారు? కూర్చోండి! ఏమిటి విశేషాలు?

పద్మ—వచ్చి అరగంటపైనయింది. తమరు పూజలోవుండి పోయారు.

శంకర—ఇప్పుడిక్కడికి కెవరైనా వచ్చారా?

పద్మ—ఎవరో ఎమ్. ఏ., బి. ఇడి. ఇరవైరూపాయల ఉద్యోగం కాళీవుందట, ఎలిమెంటరీ స్కూలులో—

శంకర—ఎమ్.ఏ. ప్యాసయి ఇరవయిరూపాలపనికే వచ్చాడూ?

పద్మ—ఏం చెయ్యమన్నారు? దానికే గతిలేదు. మొన్న మన మిల్లులో గుమస్తాపని కాళీ వచ్చినప్పుడు అయిదుగురు బి. యే. లు దరఖాస్తు పెట్టారు.

శంకర—అప్పను. బి. యే. లు కూడా పెట్టా రన్నారు.

పద్మ—కలకత్తాలో బి. యే. ప్యాసయినవాళ్ళు జోళ్ళు తుడుస్తున్నారట!

శంకర—[మందహాసం].

పద్మ—ఈయింగ్లీషు చదువుకోసం యిల్లూవొళ్లూ గుల్లచేసుకుంటే వచ్చినలాభ మిది.

శంకర—మావాడూ బి. యే. పరిక్షకు వెళ్లాడు. ఏం, జేస్తాడో! ఏపని లేకపోతే స్వ గృకంలో పెట్టేస్తాను. వాడూ-లండన్ వెళతానంటాడు! ఏమయినా లాభిస్తుందా?

పద్మ—ఈరోజుల్లో ఏమి లాభంలేదు. ఆ రోడ్డుకీ - టెండరు -

శంకర—టెండరు పెట్టారా?

పద్మ—నేనుకాదు- మా మేనల్లుడిచేత పెట్టించాను.

శంకర—కమీషనరుతో మాట్లాడారా?

పద్మ—తమ రే మాట్లాడి పుణ్యం కట్టుకోవాలి.

శంకర—నేనా! అట్లాగే! ఓవర్సీరుని మీ రొకమారు చూడండి.

శారద—ఒకసారి నే నతనితో మాట్లాడి డౌట్సు (doub క్లియర్ చేసికోవలె.

రామా—సరే! ఆ సందేహాలు తీర్చుకొని నాతో చెప్పు; ఆ తరువాతనే నిశ్చయం చేదాం.........మరి భోజనానికి లేదామా [గడియారం చూచి] అబ్బో చాలా వేళయింది.

[ఇద్దరూ వెళతారు.]

తెర.



ఓం!

బ్రహ్మకృపాహి కేవలమ్.

# వి డా కు లా ?



## అయిదో రంగము



సమయం ఉదయం 8 గంటలు.

[హరిపురంలో ఘెయిర్మన్ శంకరరావు ఇల్లు. రెండు రోజ్ వుడ్ పడకకుర్చీలు, నాలుగు మామూలుకుర్చీలు, ఒకసోఫా, ఒక టేబిలు, టేబిలువద్ద ఒక తిరుగుడుకుర్చీ ఉంటాయి. హాలులో చుట్టూ శృంగారపు చిత్రాలపటాలు వుంటాయి. మిల్లు మేనేజరు పద్మనాభం ఒకకుర్చీమీద కూర్చొని కొన్ని కాగితాలు చూస్తూ వుంటాడు. పద్మనాభం, క్రాపింగుజుట్టూ, ఓపెన్ కాలరుకోటు, తెల్లని పంచ, 35 సం॥ వయస్సు. ఘెయిర్మన్ శంకరరావు ప్రవేశం; 45 సం॥ వయస్సు, నెరుస్తున్న మీసం; సిల్కుసూటు, పాగా, చేతిలో చేతి

పద్మ—[చూశా నన్నట్లు తల ఊపుతాడు].

శంకర—మా కమీషనరు సంగతుండే, స్వపక్ష పరపక్ష నిర్ధూమ ధామం. కమీషనర్లని మనకు కావలసినవాళ్లని ఎంచుకో మంటే బాగుండును. మధ్యని వీళ్ల నొకళ్లని తెచ్చిపెట్టారు గద పాన కంలో పుడకవల్లె.

పద్మ—కమీషనర్లు వచ్చాక అధికారాలన్నీ వాళ్లచేతుల్లోనే వుంటే మధ్యని తమవంటివారికి వేలకువేలు ఖర్చుపెట్టుకోడమే మిగులు.

శంకర—నిజమే పూర్వం ఉద్యోగాలు, కంట్రాక్టులు, ఇళ్ల పన్నులు, అన్నీ ఛెయిర్మన్ చేతిలోనే వుండేవి. అందుచేత ఎలక్షనుకి పెట్టిన ఖర్చువచ్చేసేది. ఇప్పు డేదో చిల్లరవాళ్లకేకాని మాలాంటివాళ్ల కేమి లాభం లేదు. ఛెయిర్మన్ తినవలసిన వాడయితే చేపలబజారు నుంచీ కమేలానుంచీ సరు కింటికి వచ్చేసి కూరమొక్కకూడా ఎత్తుక పోయేది.

పద్మ—తమరు దీనిలో దిగటం బిజినెస్ (business) పాడవ డానికి వచ్చింది. టీ పార్టీలకిక్రింద; చందాలకిక్రింద, పార్టీని కట్టుకో డానికి వాళ్ల కిచ్చిన అప్పులకిక్రిందా వేలకువేలు ఖర్చయింది.

శంకర—ఏఖర్చువచ్చినప్పుడు అది పెట్టకతప్పదు.

పద్మ—కౌన్సిలు ఎలక్షనప్పుడు తమపార్టీకౌన్సిలర్లకి పోటీగా నిలబడ్డవాళ్లని మానిపించడాని కిచ్చినదీ, ఛెయిర్మన్ఎలక్షను టయి ములో పార్టీ నందరినీ మనతోటలో పెట్టి, నాలుగైదు రోజులు విందు లకీ, షోకులకి, సానిమేళాలకీ, (తాగుడికీ ఇచ్చినదీ, అమాంబాపతులూ పాతికముప్ఫయివే లయింది. తమ ఖాతాను సాదరుకిక్రింద పడ్డఖర్చు తమరు సరిగా చిత్తగించలేదు.

శంకర—అయివుంటుంది. అయినా, ఇదొకగౌరవం అని అందరూ అంటున్నారుకామా? ప్రతిమనిషికీ ఏదోవిధంగా పేరుసంపా దించాలనే వుంటుంది. అదీ మనిషిస్వభావం- మరీ—మనపేరు పేపర్లో వేసి ఫోటోలువేశారా? ఇంటింటా కర్పూరపుపేర్లు, పూలహారాలు వేశారుకారూ?

పద్మ—మెడలువంగిపోయి నాలుగురోజులు కదలకుండా యిరుకు పట్టేస్తా యనుకొన్నాను. బండెడుపువ్వులదండ లయ్యాయి.

శంకర—మరీ—మరి- టీపార్టీలు చేశారా? అంతా సలాం పెట్టడం, ఛెయిర్మనుగారు వస్తున్నారు దారిలో తొలగని చెపుతూ ముందొక డవాలాబంట్రోతు నడవడం—ఈ హోదా అంతా వుంటూందా?

పద్మ—చిత్తం; కాని యీ విషయంలో రూమర్లప్పుడే పుట్టాయి.

శంకర—ఏమిటా రూమర్లు?

పద్మ—వందరూపాయల కర్పూరపుపేర్లుకొని యింటింటికీ తమరే పంపించారనీ, యింకా రూమర్లకి లెక్కేమిటి...కొందరిచేత టీపార్టీలు తమరే డబ్బిచ్చి చేయించారనికూడాను.

శంకర—(ఒక నవ్వు నవ్వేసి) ఏమిటో అనుకుంటారు, లోకులో కాకులో అన్నారు. ఇన్నాళ్లు నాదగ్గరమిల్లులో ఉన్నారు కదా. వీరా రొక టీపార్టీ చేశారుకారుగద!

పద్మ—ఏదీ తమ రేదీ అనలేదని వ్రాయకొన్నాను.

శంకర—నేను చెపితేనా చేస్తాను?

పద్మ—తమమిల్లులో వుండి నేను చేస్తే బాగుండదేమో అనుకొన్నాను. అయినా తాబేదార్లం కదా! తమరోమాటంటే తప్పేముంది? అయినా యిప్పుడు మించిపోయిన దేమిటి? ఎల్లుండి యేర్పాటు చేసేదా?

శంకర—ఇప్పు డేమిటి? ఆరునెల్లయిపోయాక—మన యడ్మినిస్ట్రేషను రిపోర్టు బాగుం దన్నారు గవర్నమెంటు. మొన్న కలక్టరు వచ్చినప్పుడు ఎంక్రోచిమెంటు (Encroachment) లన్నీ చూపెట్టి చార్జీచేయించాను. ఈమాటు మనకి రావుసాహెబు కితాబు రాక తప్పదు.

పద్మ—అయితే అప్పుడు టీపార్టీకి అందరికన్నా ముందుఛాన్సు నాకివ్వించాలి.

శంకర—మనయింటిదగ్గరనుంచి మిల్లుదాకా తారురోడ్డు వేయించడానికి శాంక్షను చేయించాను.

పద్మ—ఈమధ్య నెవరో పేపర్లో రాశారు. ఊళ్లో రోడ్లు బాగా లేవనీ, వీధులకి లైట్లు చాలవని, ఎక్కడిచెత్తాకుళ్లూ అక్కడే వుండి పోతూందనీ-

శంకర—అది మనడ్యూటీకాదు. అదంతా కమీషనరు డ్యూటీ. ఆ తిట్లు, దీవనలూ, చీవాట్లు, చెప్పుదెబ్బలు అన్నీ అతనికే!

పద్మ—తమపేరు ప్రెసిడెన్సీఅంతా వాకబుఅయింది. ఆంధ్ర పత్రిక సంవత్సరాదిసంచికకి ఈయేడు తమఫోటో పంపిస్తున్నాను.

శంకర—కౌన్సిలుమీటింగురూములో నాదో పెద్దఫోటో ఉండాలంటున్నా రందరూ!

పద్మ—ఆయిల్ పెయింటింగు తయారు చేయిస్తాను. ఏముంది నాలుగువందలు చాలు. ఏకౌన్సిలర్ పేరో పెట్టి ప్రెజంటు చేయిద్దాం.

శంకర—ఈలోపుగా ఆ రావుసాయిబు కితాబు వచ్చేస్తే బాగుండునా? వందలకొద్దీ సిల్వరుజూబిలీ కిచ్చి, కనిస్టేబుదగ్గరనుండి కలక్టరుదాకా వచ్చేపోయే వుద్యోగస్థులకి టీపార్టీలు చేసి, చక్రవర్తి గారి జబ్బులో, గుళ్లలోనూ మశీదుల్లోనూ, అభిషేకాలూ ప్రార్థనలూ చేయించి, రెండుమూడువేలమందికి వెలంకాయలంతేసి బూర్లతో అన్నదానం చేసి ఇన్ని తంటాలూ పడుతూంటే ఇవన్నీ గనర్నమెంటు కళ్లకి కనబడవా ఏమిటయ్యా! తాసీల్దార్లకిట్లే ఇచ్చేస్తున్నారు—రావు సాయబు.

పద్మ—పోనీండి, ఇప్పుడు. తమ కొచ్చిన లోప మేమిటి— ఇంతకీ ఆ యోగం పట్టాలి. అన్నట్టు— అసలుసంగతి చెప్పడం మర చాను—కాకినాడ మార్వాడీ బాకీ పంపించమని ఉత్తరం రాశాడు.

శంకర—నగానికి పెరిగిందా ఏమిటి?

పద్మ—వడ్డీలతో దగ్గరదగ్గర లకారాని కుంటుంది.

శంకర—అబ్బా! అయినా అత నట్లా తొందరపడడే! నన్ను బాగా తెలుసు.

శంకర— ఆసొమ్ము అలా వుంచండి. నాతో చెప్పకుండా సరుకు విడుదల చెయ్యకండి. అయినా అంతస్టాకు ఒక్కసారి ఆర్డరు చేస్తే దెబ్బతినేస్తాం.

పద్మ—తమతో మాట్లాడదానికే వీలుచిక్కదు. తమరు ఈ పాటయినా తప్పకొని బిజినెస్ మీద శ్రద్ధపెడితేగాని, గట్టిదెబ్బ తగుల్తుందేమో అని నాకు చాలా భయంగా ఉంది.

శంకర—ఇప్పట్లో విశిచిపెట్టడాని కెంతమాత్రమూ వీలు లేదు. మంచి పటపటాంగంగా వుంది. కొందరు కాంగ్రెసువాళ్ళు న్నారు. వీళ్ళు వ్రతిమీటింగులోనూ అవకతవకప్రశ్నలు వెయ్యడం, డిసెంట్లుపెట్టడం, గవర్నమెంటుకి రాయడం జరిగిస్తూన్నారు. నో కాన్ఫిడెన్సు పెడతారని ఆరేసినెలలకల్లా అదో బెదిరింపు- కమీషనరు కూడా వాళ్లతో బుజం కలుపుతున్నాడు.

పద్మ—ఈమధ్య రత్తయ్యగారికికూడా తమమీద కోపం వచ్చినట్లుంది.

శంకర—రెండువేలు అప్పుఅడిగాడు. ఇవ్వలేదని ఏడుపు. వదో చూసి పారెయ్యాలి......ఏమయినా యిప్పట్లో మానేస్తే వాళ్లకి జడిసి మానేశామంటారు—అదీకాక—మనకి కావలసిన పనులుకూడా కొన్ని వుండిపోయాయి.

పద్మ—సెలవా?

శంకర—అన్నట్టు ఎల్లుండి యిస్కూలులో పిల్లలకి బహుమతులు పంచిపెట్టడానికి మీటింగుచేస్తారట. హెడ్డుమాస్టరుగారు నన్ను ప్రెసిడెంటుగా వుండమన్నారు. మీరు ఒకచిన్న లెక్చరు రాసియ్యాలి. నాకు యింగ్లీషురాక పోవడం చాలా చిక్కొచ్చింది.

పద్మ—తమకే యింగ్లీషువస్తేనా? యీపాటి మంత్రిపని చేయరూ!

శంకర—ఈమధ్య మాస్టరునిపెట్టి అక్షరాలు పేర్లూ నేర్చుకొని పుస్తకం పట్టాను. అరవైయేళ్ళు వచ్చాక చదువుకోక మన్ను కొట్టుకొంటానా అని ఇప్పుడు చదు వబ్బుతుందా?

పద్మ—నాకు మిల్లుకు వేళయిపోతూంది సెలవా?

శంకర—లెక్చరు రాస్తారుకామా! ఇంగ్లీషులెక్చరే తెలుగక్షరాలతో రాసివ్వండి. అర్థం తెలియకపోతే నేమిటి? రెండు మూడు సార్లు చదివి కంఠతాపెట్టి ఏకరువు పెట్టేస్తాను.

పద్మ—చిత్తం! సెలవు పుచ్చుకుంటాను.

శంకర—ఉండండి! మా అబ్బాయి మళ్ళా వివాహం చేసుకొంటున్నాను, రమ్మని వైరిచ్చాడు. ఆ పిల్ల బి.ఏ. పరీక్షకు వెళ్ళిందట.

పద్మ—చాలా సంతోషం. ఎప్పుడు వివాహం?

శంకర—రేపే! ఈ [illegible] గవర్నరు వస్తున్నాడు. ఇప్పటికేమీ ఏర్పాట్లు లేవు. ఎట్లా వెళ్లడం?

పద్మ—ఏదో ఒక్కపూటకు తమరు వెళ్ళకపోతే ఎట్లా?

శంకర—ఉండండి! ఆ వైరు తెస్తాను. దానిలో ఒకమాట సరిగా అర్థం కాలేదు. [శంకరరావు ఇంట్లోకి వెళతాడు. నౌకరు ఒక విజిటింగుకార్డు తెచ్చి పద్మనాభందగ్గిర బల్లమీద పెడతాడు. పద్మనాభం చూస్తూండగా శంకరరావు వైరుచేతిలో పట్టుకొని ప్రవేశించి] గవర్నరుకి బాలుచేసినప్పుడు ఆపిల్లని పిలిపిస్తాను- గవర్నరుదొరసానితో ఇంగ్లీషు మాట్లాడడానికి. చూడండి! ఈ చివరిమాట—

పద్మ—[వైరు చదివి] స్పెషల్ మారేజీ ఆక్టు.

శంకర—అంటే!

పద్మ—పెళ్ళిళ్ళకి ఒక స్పెషల్ ఆక్టు ఉందట.

శంకర—పెళ్ళిళ్ళకీ ఆక్టే! మ్యునిసిపల్ ఆక్టుకు మల్లె!

పద్మ—అదేమిటో ప్లీడరు నడిగి తెలుసుకోవాలి. ఎవరో వచ్చారు. [విజిటింగుకార్డు యిస్తాడు.]

శంకర—[కార్డు తీసుకొని అక్షరాలు కూడబలుకుతూ] ఎవరిది? కె. ఆర్. వి. యూ. యన్. కె.

పద్మ—కె. ఆర్. వెంకటరావు.

శంకర—అవును. కె. ఆర్. వెంకటరావు, డి. టి.

పద్మ—డిస్ట్రిక్టు మునిసిఫ్.

శంకర—ఏదో సిఫార్సుకి కాబోలు. కమీషనరు దగ్గరకి పొమ్మంటాను.

పద్మ—ఏమో ఎవరో అనుమానం పెట్టారుకాబోలు.

శంకర—అతని బ్రాంచివుందికాదూ ఇక్కడ? ఈమాటు వృత్తి పన్నులో బిగించేద్దాం. మళ్లా అడిగితే గిరగిర తిప్పిపారేద్దాం.

పద్మ—ఇప్పుడేమి క్యాష్ పైగాలేదు. మొన్ననే ధర చురికిందని వెయ్యిబేళ్లనూలుకి ఆర్డరిచ్చాను. నెలవాయిదా, జట్టీబేరం! దానికి సరిపడ్డ క్యాష్ ( cash ) మాత్రం వుంది.

పద్మ—రమ్మంటానూ! [వెళ్లి పిలవగా వెంకటావ్రు ప్రవేశిస్తాడు. సుమారు ఏభయి సంవత్సరాల వయస్సు, తలపాగా, నల్లని లాంకోటు, తెల్లపంచ, తెల్లజరీకండువా, కళ్లకి సులోచనాలు, కాళ్ళకి ఆకుచెప్పులు, చేతిలో చేతికర్రతో ప్రవేశించి, చెప్పులు, చేతికర్ర దూరంగా ఉంచి లోనికి వస్తాడు.]

శంకర—[లేచి] దయచేయండి! [పడకకుర్చీ చూపెడతాడు]

వెంకట—అక్కరలేదు. తమరు దయచేయండి. [మామూలు కుర్చీలో కూర్చుంటాడు] క్షేమమా?

శంకర—తమ దయవల్ల! తమదర్శనం ఎన్నడూ చేయలేదు.

వెంకట—నేను విజయనగరంలో జిల్లా మునసబుగా ఉంటున్నాను. తమతో కొన్ని సంగతులు మాట్లాడుదామని వచ్చాను.

శంకర—సెలవియ్యండి. ఒకసారి ఆఫీసుకు వెళదామనుకొంటున్నాను. కమీషనరుగారిని కూడా రమ్మని కారు పంపాను. [పద్మనాభంతో] మీరు మిల్లుకు వెళ్లండి. [పద్మనాభం ఇద్దరివద్ద సెలవు పుచ్చుకొని వెళతాడు.]

వెంకట—మీకోడలు, విజయనగరం పిల్ల, ఆమె విషయమై ఏమి టాలోచించారు?

శంకర—విజయనగరం పిల్లా?... తమకు వారిని తెలుసునా ఏమిటండి?

వెంకట—ఆ! ఆపిల్ల తండ్రి—శామశాస్త్రి—తరుచు మా యింటికి వస్తూవుంటాడు. పదేపదే మొర్రపెట్టుకోగా, ఆపిల్ల అవస్థ చూచి, ఏమయినా సెటలవుతుందేమో అని-

శంకర—ఏమి సెలవు?

వెంకట—ఏమయినా సెట లవుతుందేమో అని-

శంకర—సెటలు కావడమంటే తమ అభిప్రాయం?

వెంకట—ఏముందీ! ఆపిల్లని తెచ్చుకొని కాపురం నిలబెట్టమనీ-

శంకర—నామనవి వింటారా! అసలు ఆపిల్లతండ్రి నోటిదురుసు మనిషి. మాఅబ్బాయికి వాళ్ళసంబంధం నచ్చలేదు. అయితే అట్లాంటి సంబంధం ఎందుకు చేశావయ్యా అని తమ రడగవచ్చును. నాభార్య అతని చెల్లెలు. దానిపట్టుదలమీద చిన్నతనంలో చెయ్యవలసివచ్చింది. ఇప్పుడు మావాడు బి. యే. చదువుతున్నాడు. లండను వెళ్లి కలక్టరు పరిక్షకి చదువుతానంటున్నాడు. అందుచేత ఆపిల్ల మావాడికి నచ్చ లేదు. ఇంకా అల్లుడికీ మామగారికీ కొన్ని ఘర్షణలు జరిగేవుంటాయి. అందునుంచే ఈ ఏడెనిమిదేళ్ళనుంచీ మాకూవాళ్ళకీ రాక పోకలే లేవు.

వెంకట—తమవంటివారు అబ్బాయికి నచ్చచెప్పాలి. కావల సిన సమ్మంధం. మంచి సాంప్రదాయం. ఐశ్వర్య మున్నప్పు డిలాంటి వాళ్ళని ఓకంట చూస్తేనే కీర్తి.

శంకర—చిత్తం! వాస్తవమే! కాని మావాడికి నచ్చచెప్ప డానికి టైము మించిపోయింది. వాడు మొన్ననే మళ్లీ వివాహం చేసు కొన్నాడు. బి. ఏ. చదువుకొన్న పిల్ల. అప్పుడే వివాహమయిపోయింది. ఇదిగో వైరు. [వైరుచేతి కియ్యకుండా దూరంనుంచే చూపించి మడిచి జేబులో పెట్టుకుంటాడు] పెద్ద లెక్చరుకూడా యిస్తుందట. మరో యేర్పాటేమయినా తమరు సెలవిస్తే, ఈ సంవత్సరం మిల్లు తాలూకు లాభనష్టాలు తేల్చుకొన్నాక మాట్లాడుకొందాం.

వెంకట—అసలు ఈ వ్యవహారంలోకి నేను రానన్నాను. నా ప్రాణాలుతీసి ఎలాగయినా మాట్లాడమని లాక్కొచ్చాడు. మావంటి

వాళ్లు ఇలాంటి వ్యవహారాల్లో ఫలితం ఉంటేనే దిగాలిగాని... ... నేను గృహస్థురీత్యా వచ్చానుగాని మునసబుగా మాట్లాడ లేదు. అత గాడు రెస్టిట్యూషన్ ఆఫ్ కాంజుగల్ రైట్సు (restitution of conjugal rights) కి దావా తెస్తే తప్పకుండా అతనిపక్షమే తీర్పవుతుంది.

శంకర—కోర్టువారు నిర్బంధిస్తేమాత్రం మనసు లేనిమనువు ఎట్లా సాగుతుందండీ?

వెంకట—అయితే అప్పుడే వివాహమయి పోయిందన్నమాట?

శంకర—అయిపోయింది, మొన్ననే! నేనుకూడా వెళ్ళలేదు. మాకు గవర్నరుగారి హడావుడొకటి వచ్చిపడింది... అయితే... ... అతగాడుకూడా వచ్చాడా ఏమిటండీ?

వెంకట—వచ్చి వీధిలో ఉన్నాడు. అతడు రానిదే వచ్చానా నేను? ఏమయ్యోయ్, కామశాస్త్రుర్లూ! [కామశాస్త్రి ప్రవేశం-సీర్కా-విధోవతిపింజపెట్టి కట్టుకుంటాడు. మెళ్లోరుద్రాక్షతావళం, కుడి భుజంమీద మడతపెట్టిన కండువా; ఎడంభుజంమీద వీపుమీద వేలాడుతూ ఇత్తడిచెంబుకట్టిన అంగవస్త్రం- చంకలో చిన్నమూట-మాసినగడ్డం].

శంకర— -[నిర్ఘాంతపోయి] ఏమయ్యోయి! ఎప్పుడు రాక!

కామ—ఇద్దరం కలిసేవచ్చాం! శవో, శవో, తేల్చుకోక పోతే ఎన్నాళ్ళు మరి?

శంకర—ఆ వ్యవహారం గురించేనా? పంతులుగారితో మనవి జేశాను యావత్తుసంగతులూ- అవతల కమీషనరుగారు కనిపెట్టు కున్నారు- మళ్లా కలుసుకొందాం. లేచి వెంకట్రావుకు నమస్కరించి సెలవు. [అని వెళ్ళబోతాడు]

కామ—[అడ్డు వచ్చి] మళ్లా కలుసుకోడం కాదు. మునసబు గారు శ్రమపడి దయచేశారు. వారిమాటయినా విన్నారా?

శంకర—నేను వారితో యావత్తు సంగతులూ మనవిచేశాను. వారూ నేనూ మాట్లాడుకున్నాం! వారు సెలవిస్తారు- [ముందుకు గుమ్మంధాకా నడుస్తాడు. కామశాస్త్రి దోవ కడ్డంగా నిలబడి]

కామ—అదికాదు, ఉండవయ్యా! నీ అభిప్రాయం నాకు తెలిసింది. ఎప్పటికీ, బాగుడుమూతాలే ఆడేవు.

శంకర—దారి కడ్డం నిలిచి వెళ్ళనియ్య వేమిటి? ఒరే! అప్పల స్వామీ!

కామ—బంట్రోతుని పిలుస్తున్నా వేమిటి? ఎవరు వచ్చారో చూస్తున్నావా? [వెంకటరావుని చూపిస్తాడు]

శంకర—అటువంటి పెద్దలు దయచేసినప్పుడు యిటువంటి రసాభాసవుపనులుచేయకూడదు. వారిమర్యాదా కాపాడడానికి చూడాలి.

కామ—వారి మర్యాదాకికూడా భంగం కలిగిస్తావేమిటి?

శంకర—వారు దయచేసివుండగానే దారికడ్డం నిలిచావు కదా! వారిని సాక్ష్యంవేసి పోలీసుకేసు పెడితేనో?

కామ—వ్యవహారం చాలా ముదిరిందే! కొబ్బరి కాయలవగ్గ కం రోజుల్లో ఊరూరా తిరిగి సత్రంఅరుగుమీద పైమీద గుడ్డ వేసుకొని పడుకొన్న రోజులా ఇవి?

[శంకరరావు కోపంగా చూస్తాడు. ముసనబు కామశాస్త్రి 'ఇలా రావయ్యా పిచ్చిబ్రాహ్మడా'అని తనదగ్గరకి పిలుస్తాడు. ఆ సమయంలో శంకరరావు పైకి దాటేస్తాడు.]

వెంకట—ఈమర్యాదకా నన్నుకూడా తీసుక వచ్చావు? పోదాం పద! బంట్రోతుచేత పైకి పంపించేసి తలుపు వేయిస్తాడు.

కామ...[వెంకటరావు చేతులుపట్టుకొని] క్షమించాలి. ఇవి చేతులు కావు కాళ్ళు; తమర్ని శ్రమపెట్టి తీసుకొనివచ్చి అమర్యాదా కూడా కలిగించాను. త్యాష్ట్రమని తెలిసుంటే బుద్ధి గడ్డితిని తమర్ని తీసుకొచ్చా!

వెంకట—ఫర్వాలేదు. అతనిబుద్ధే చూపించుకొన్నాడు. [లేస్తాడు.]

కామ—ఏమిటి తేల్చాడు బాబూ?

వెంకట—మీ అల్లుడు బి ఏ. చదువుకొన్నపిల్లని పెళ్ళి చేసికొన్నాడట!

కామ—అయిందీ? అనుకొన్నంతపనీ అయిందీ? మరి మీాకే మిటి గత్యంతరం? [ఇద్దరూ మెల్లగా నడుస్తూంటారు]

వెంకట—ఏముందీ! ఓపికుంటే దావా పడేయడమే! మరి మీాపిల్ల ఇప్పుడు గుంటూారులో ఉందేమో!

కామ—ఈపట్టున వెళ్ళి లాక్కొస్తా నింటికి. అది చదువుకొని ఉద్యోగం చెయ్యాలా? ఊళ్లేలాలా? తమ ఆసరా వుంటు నేను కృతార్థుణ్ణే!

వెంకట—సరే చూద్దాం!

కామ—నెల కొక పాతికేనా ఇప్పిస్తారా మనోవృత్తి?

వెంకట—చూదాం పదవయ్యా! ఏకగాభరా!

కామ--మరి నేను ఇలా గుంటూారు వెళ్లి పిల్లని తీసుకొచ్చేస్తాను. తమరు బంట్రోతుని పంపించి మా యింటికి చిన్న వర్తమానం చేయించాలి నే నిలా వెళ్ళినట్టు—

[వెంకటరావు జవాబు చెప్పడు. ఇద్దరూ వెళతారు]

తెర

---

ఓం!

బ్రహ్మకృపాహి కేవలమ్.

# విడాకులా?



## ఆరో రంగము

సమయం సాయంత్రం 6—30' గంటలు.

[రామచంద్రుని ఇల్లు; శారద చదువుకొనే గది. కొన్ని కుర్చీలు, సోఫా, పుస్తకాలబీరువా, ప్రకృతిదృశ్యాలున్న చిత్రపటాలూ ఉంటాయి. శారద సిల్కుచీర కట్టుకొని తంబురా శ్రుతిలో పాడు

కుంటూఉంటుంది. వేణు టెన్నిస్‌డ్రెస్‌తో వచ్చి సిగరెట్టుకాలుస్తూ, కోటు విప్పుకుంటూ ప్రవేశం].

వేణు—శారదా!

శారద—ఏమి?

వేణు—మాఫాదర్ వైరిచ్చారు.

శారద—ఎందుకు?

వేణు—వాళ్ళ మ్యూనిసిపాలిటీని గవర్నరుగారు విజిటు చేస్తారట. అందుకు నిన్ను నన్ను రమ్మని—ఇదిగో వైరు. [వైరుచూపిస్తాడు]

శారద—[వైరుచదువుకొని] అయితే నే నెందుకు?

వేణు—హెర్ ఎక్సెలెన్సీని రిసీవు చేసికోడానికేమో! ఎడ్యుకేటెడ్డు లేడీ కోడలయినప్పుడు అపర్ట్యూనిటీ ఎందుకు పోవాలని.

శారద—ఐ సీ (I see)! ఎప్పు డది?

వేణు—ఎల్లుండే. రేపు మనం బయలుదేరి వెళ్ళాలి.

శారద—ఇంపాసిబిల్! రేపటిరాత్రికి నేను బెంగుళూరు పోవలె! మరునాడు నాకు అక్కడ ఎంగేజిమెంటు ఉన్నది.

వేణు—ఉంటే పోస్టుపోన్ చేసుకోవాలి!

శారద—ఎల్లుండిదినం మైసూరు వుమెన్సు కాన్ఫరెన్సుకు ప్రిసైడు చేసేదానికి ఇన్వైటు చేసినారు. నేను ఆక్సెప్టు (accept) చేసినానే!

వేణు—మాఫాదర్ చాలా ఫీలవుతారే! [సోఫాలో కూర్చుంటాడు]

శారద—ఐ కాంట్ హెల్పు. (I cant help) నీవు పో!

వేణు—బాగానే ఉంది.

శారద—బాగానేఉండడంటె వాట్ డూ యూ మీన్ (what do you mean) నా రెస్పాన్సిబిలిటీస్ (responsibilities) నీకెట్లా తెలుసు?

వేణు—ఫ్లోనీ లే కోపపడకు.

శారద—నాకు రేపటికి మనీ కావాలె బెంగుళూరు పోయే దానికి.

వేణు—మనీ యింకా రాలేదే! మనంపోతే అక్కడే యిద్దా మని ఫాదరు ఉద్దేశమేమో!

శారద—వైరిచ్చి టి. యమ్. ఓ తెప్పించుమీ!

వేణు--ఇప్పటికి మీఫాదరు నడిగి మానేజి (manage) చేయి.

శారద—మాఫాదరువద్ద నేమున్నది? ఫాదరు పెన్షనంతా ఇంటికర్చులకుదా సెలవై పోతున్నది......మనయింట్లో టెన్నిస్ గ్రౌండు వేయిస్తానంటివే!

వేణు—ఇప్పట్లో అయేలాగు కనబడదు. వచ్చేనెలలో వేయి ద్దాం. ఈరాత్రి సినిమాకు వెళదామా?

శారద—సినిమావద్దు! మట్టీవద్దు! మారేజి అయేవరక్కూం, మంచిమాటలు చెప్పి, మారేజిఅయి వారం దినాలుకాలేదు. ఇప్పుడే డిసీవు (decieve) చేస్తున్నావే!

వేణు—ఊరకే హాస్యానికంటే సీరియస్‌గా తీసుకుంటావేమిటీ? ఊరకే నిన్ను టికిల్ చేయడాని కన్నాను.

శారద—మారేజి సెటల్ చేసేదానికి ముందుగా నేను నీతో ఫిక్సప్ (fix up) చేయ లేదూ? నా ప్రొగ్రామ్సుకీ నా టూర్సుకీ అడ్డుపెట్టేది లేదని ప్రామిస్ చేయలేదూ నీవు?

వేణు—చేశాను, చేశాను, చేశాను—సరా?

శారద—ఇప్పుడే ఆరంబిస్తివే ట్రిక్సు?

వేణు—అప్పుడప్పుడు కొన్ని ట్రిక్సు చేస్తేకాని కామాన్సు లేదు. యిట్లా దగ్గరగా రా?

శారద—ఎందుకు?

వేణు—నాదగ్గరగా వచ్చి కూర్చో!

శారద—ఎందుకు చెప్పు?

వేణు—పనుంది.

శారద—ఏమాపని?

వేణు—[illegible] ! జస్టు ఏ కిస్ (just a kiss)

శారద— డోంటు బి సిల్లీ (dont be silly)

వేణు—నువ్వుకూడా టీజింగ్ ఆరంభించావే! [లేచివచ్చి శారద దగ్గరగా కూర్చుంటాడు]

శారద—నేను టీజింగ్ చేయలేను. ఐ యామ్ ఆల్ సిరియస్ (I am all serious)

వేణు—[లేచి] ఏదీ సీరియస్ నెస్ చూదాం! [శారదచేయి పట్టుకొని బలవంతముగా ఒక్కఊపున లాగుతాడు. శారద చేతి ముణుకు కుర్చీకి తగిలి నెప్పివేస్తుంది. శారదముఖంలో నొప్పిబాధ కనబడుతుంది]

వేణు—చేతికి తగిలిందా ?

శారద—[కోపంగా] ఇంతకంటె డీసెంటు (decent) గా బిహేవు (behave) చేయలేవా ?

వేణు—ఐ యామ్ వెరీ సారీ ! (I am very sorry) చూడు! శారదా ! టెన్నిస్ కోర్టు వేయిస్తే మన కెంత ఖర్చవుతుంది ?

శారద—[జవాబు చెప్పదు].

వేణు—రేపే బిగిన్ (begin) చేదాం! టెన్నిస్ కోర్టుసరుక్కు.

శారద— ఐ సే! (I say! [illegible] bully) చేస్తే [illegible] ! [illegible] ఒక్క జువెల్ (jewel) [illegible], ఒక చీర కొన్నా [illegible] స్టూప్ (stoop [illegible] లో [illegible] -

వేణు — [illegible] ? [illegible] ఫాదర్ వస్తున్నారా?

శారద—[విసుగుదలతో] ఫాదర్ కాదు; ఎవరో ఇంకొకమనిషి! నా కీరోజున, లెటర్ వ్రాసినాడు సాయంకాలం వస్తానని;

వేణు—ఎందుకు వస్తున్నాడు?

శారద—పోయినవారం హిందూ సప్లిమెంటులో కో-ఎడ్యుకేషన్ గురించి ఆర్టికిల్ (article) వ్రాస్తినికదా! అందుపైని ఏదో డిస్కస్ చేసేదానికి.

[ప్రకాశం ప్రవేశిస్తాడు- ఖద్దరుపంచ, ఖద్దరుచొక్కా, ఖద్దరు కండువా వల్లెవాటు. చేతిలో హిందీపుస్తకం; ఆకు చెప్పులు దూరంగా విడిచి, శారదకు నమస్కారం చేసి] రావచ్చునా? [వేణువైపు క్రీగంటి చూపు].

శారద—[లేచి, నమస్కరించి] ఓ యెస్! [వేణుని బొటన వ్రేలితో చూపిస్తూ] మిస్టర్ వేణుగోపాలరావు అండు మిస్టర్ ...

ప్రకా—సూర్యం అంటారు నన్ను [ప్రకాశం, వేణు, ఒకరి కొకరు నమస్కారాలు]

శారద—కూర్చోండి! మీరు ఇక్కడ ఏమిపని చేస్తున్నారు?

ప్రకా—మైలాపురంలో హిందీపాఠాలు చెబుతున్నాను.

శారద—మీరు హిందీ బాగా చదువుకొన్నారా?

ప్రకా—ఏదో వ్యావహారిక జ్ఞానం!

శారద—మీరు నార్తిండియా పోయినారా?

ప్రకా—వెళ్లానండి! రెండేళ్లు కాశీవిశ్వవిద్యాలయంలోనే చదువుకొన్నాను.

శారద—అక్కడ ఎట్లా వుంటుందండీ? వుమెన్సు కండిషన్-

ప్రకా...ఇక్కడకంటే అన్యాయంగా వుంద. బ్రాహ్మలకి కూడా అపరిమితమయిన ఘోషా!

శారద...అక్కడ ముసల్మాను ఇన్‌ఫ్లుయన్సు జాస్తీ! ఇప్పుడు టర్కీలోకూడా పరదా తగ్గిపోయినదే! స్త్రీలహక్కుల విషయంలో ముసల్మాను లా (law) దా చాలా బాగా ఉన్నది.

ప్రకా...ఉత్తరదేశంలోకూడా ఇప్పుడిప్పుడే స్త్రీలు మేలుకొంటున్నారు. అక్కడకూడా మహిళాసభలు జరుగుతున్నాయి. కాని వాళ్లకు ధైర్యం లేదు. మహిళాసభలో పరదా తొలగించడానికి

తీర్మానం చేస్తూ పత్రికావిలేఖరులని తెర వెనకాల కూర్చోపెడతారు.
[శారద, వేణు, నవ్వుతారు]

శారద... మన దేశంలో ఈ కస్టమ్ ఒక్క-క్షత్రియులలోనే ఉన్నది.

పత్రికా... వెలమల్లోనూ, తెలగాల్లోనూ, కమ్మవారిలో కూడా కొంతఉంది. ఈసత్యాగ్రహోద్యమంలో అనేకమంది క్షత్రియ స్త్రీలు ఘోషా విడిచిపెట్టి పైకివచ్చి పనిచేశారు.

శారద... వాస్తవందా! మిసెస్ ఆనిబిసెంటు తరువాత స్త్రీల విషయంలో గాంధీ చాలా హెల్పుచేసినాడు.

పత్రికా... ఆ మాటకు వస్తే మొట్టమొదట స్త్రీల ముక్తి ఆందోళనకి సహాయం చేసినవారు రాజారామమోహనరాయి.

శారద... ముక్తియా? ఏమది? ఏమంటిరి?

పత్రికా... ముక్తి ఆందోళన- ఇంగ్లీషులో ఇమాన్సిపేషన్ (emancipation).

శారద... అట్లా అంటే మొదటనే బాగా తెలిసివుండునే!

ప్రకా... అసలు అది హిందీ ప్రయోగం. నాకు సరియైన తెలుగు మాట దొరకనప్పుడు యింగ్లీషుపదానికి బదులు హిందీశబ్దం వాడుతాను.

శారద... మీరు లెటరు వ్రాస్తిరే! మీడౌట్సు చెప్పండి; క్లియర్ చేసేదానికి ట్రై చేస్తాను.

పత్రికా... నాకు స్వేచ్ఛగా మాట్లాడడానికి అనుజ్ఞ ఇప్పించాలి. ఏ అంశంనైనా సత్యాన్వేషణదృష్టితో చర్చించేటప్పుడు పక్షపాతానికీ ముఖప్రీతిమాటలకీ తా వుండకూడదు. స్వాభిమానంతో కూడినది చర్చ అనిపించుకోదు.

శారద—డిస్కషన్ అన్‌బాయాస్డు (unbiassed) గా ఉండాల నంటారా? నాదికూడా అదే ఐడియా! (idea)

పత్రికా—చాలాసంతోషం - హిందూ పర్లిమెంటులో మీరు వ్రాసిన వ్యాసంలో సహశిక్షగురించి నదభిప్రాయ మిచ్చారు. అది చూడగానే ఎలాగయినా మీ దర్శనం చేసి స్వయంగా సందేహ

నివృత్తి చేసికోవాలని కోరిక పుట్టింది. నా కోరిక మన్నించి ఈ చర్చకు అవకాశం ఇచ్చినందుకు కృతజ్ఞుణ్ణి.

శారద... ఏమదీ! ఏమంటిరి? సహశిక్షయా?

ప్రిన్సిపాల్—సహశిక్ష అనగా కో-ఎడ్యుకేషన్ (co-education).

శారద—కో-ఎడ్యుకేషన్‌కి సహశిక్ష అంటారా తెనుగులో? - శిక్ష అంటే పనిష్మెంటు కాదండీ?

ప్రిన్సిపాల్—తెలుగులో శిక్ష అనగా దండనే! హిందీలో విద్య-

శారద—సరి! సహవిద్య అందాం! స్త్రీలు, పురుషులు ఒక బడిలో చదివేది.

ప్రిన్సిపాల్—ఆ విషయంలో నాకు చాలా భిన్నాభిప్రాయా లున్నాయి.

శారద—చెప్పండి!

ప్రిన్సిపాల్—అది మన దేశాని కనర్థదాయకం. సహవిద్య బాగా ప్రచారంలోఉన్న అమెరికా, రష్యావంటి దేశాల్లో దానివల్ల దుష్ఫలి తాలే కనబడుతున్నాయి. వాళ్ళుకూడా దానినితప్పింపడానికే ప్రయ త్నిస్తున్నారు. జపాన్‌లో సహశిక్ష లేనేలేదు. జర్మనీ ఇటలీ దేశా లలోకూడా దానిమీద ఆంక్షపెట్టారు.

శారద—అమెరికా ఇప్పుడు అన్నిదేశాలకంటె మోస్టు ప్రాస్పరస్ (most prosperous) గా వుందికదా! దీనివలన నష్టము వచ్చినదా?

ప్రిన్సిపాల్—అమెరికా దీనివలన కలిగిననష్టం తెలుసుకోవలె నంటే జడ్జి లిండ్సే వ్రాసిన "రివోల్టు ఆఫ్ యూత్" "కంపేనియ నేట్ మారేజి" అనేగ్రంథాలు చదవండి. తరువాత న్యూయార్కులో హార్పర్సు మాగజిన్ (harper's magazine) అని ఒకటిఉంది. దానిలో ఒక మహాశయుడు వ్రాసినదిచూస్తే మగవాళ్లబడులలో జదివేబాలికలలో 'కౌమార్యం' - అంటే 'కన్యాత్వం' - మీకు ఇంగ్లీషున చెప్పాలి కాబోలు - వర్జినిటీ (virginity) సురక్షితంగా

ఉన్నవాళ్ళు చాలా తక్కువమంది ఉన్నట్లు తెలుస్తుంది. ఇది మిక్కిలి రహస్యమైన వైద్యపరీక్షవల్ల తేలిన సారాంశమని వ్రాశారు.

శారద—నేను చూడలేదు; ఆ బుక్కు చూడవలె.

పత్రికా—అయితే అమెరికా ఇంత ఔన్నత్యంలో ఉండడానికి కారణం వేరు. అక్కడి నైతిక జీవనంలో లోపాలున్నా, ప్రజలలో దేశభక్తి, కర్తవ్యపరాయణత, జ్ఞానతృష్ణ, ఐకమత్యం మొదలయిన కొన్ని సుగుణా లున్నాయి.

శారద—ఇంకా మీరు చెప్పేదేమయినా ఉన్నదా ?

పత్రికా—ఇంగ్లాండులోకూడా పురాతనంనుంచీ ఉన్న కేంబ్రిడ్జి ఆక్స్ఫర్డు విశ్వవిద్యాలయాల్లోకూడా స్త్రీలకూ, పురుషులకూ ఉన్నత విద్యాశాలలు వేరువేరుగానే ఉన్నాయి.

శారద—ఒక్కసంగతి చూడండి! సహవిద్య మనకి క్రొత్త సంగతికాదు - ఇండ్లలో ఆడపిల్లలు మగపిల్లకాయలు కలిసి తిరుగుతూఉంటారు కదా ! బడులలోకూడా ఆ హోమ్లీ డొమెస్టిక్ అట్మాస్ఫియర్ (homely domestic atmosphere) క్రియేటు (create) చేస్తే అదే సహవిద్య. పూర్వం ఋషులవద్ద బాలకు బాలికలు కలిసి చదివేవారు కారా ?

పత్రికా—అందు కిప్పుడున్న ఉన్నత విద్యాశాలలు పనికిరావు-అందుకు పనికివచ్చే వాతావరణం కల్పించే ప్రయత్నా లుండాలి. మీరు... ...బిల్హణీయం విన్నారా ? తెలిసి కట్టినప్పుడే... ...

శాదర—కథ వింటిని. ఇద్దరికీ హాస్యగా తెరకట్టినా సహపఠనే వారి క్యూరియాసిటీ, ఆ వాంఛ రౌజ్ అయింది. ఆ సౌన్నిహిత్యం చనిపోయే దానికి సహాయపడేది సహవిద్యదా!...సరి! సహవిద్య విషయంలో మన అభిప్రాయములు వేరవుతాయి. దానికి నిందా కేమీ అనుకోవద్దు. మీ అగ్గిమెంట్సు నిండా బాగా ఉన్నాయి. స్త్రీల మువ్‌మెంటుకు పనికి వచ్చే గ్రంథాలు కూడా, కూడా చదువుతున్నాను. మీ రప్పుడప్పుడు వస్తే యింకా చాలా సంగతులు మనము చర్చించవచ్చును...నాకు తెలుగులో ఉపన్యాసం చేసేదానికి నిండా కష్టంగా

ఉంది. మీవద్ద కొన్ని తెలుగుమాటలుకూడా నేర్చుకోవలె. తరచుగా వస్తూ ఉంటారా?

ప్రికా—విధిగా- నాకు మహావకాశం ఇచ్చారు. మీవంటి దేశసేవికల గోష్ఠి దొరకడం ఎలాగ? ఇలాంటి కొన్ని విషయాలలో తప్ప నాకు స్త్రీస్వాతంత్ర్యోద్యమమంటే చాలా సానుభూతి ఉంది. నాచర్చలో మీ మనస్సుని కష్ట పెట్టిఉంటే క్షమించాలి. సెలవు! [వేణుతో] సెలవు! [వెళతాడు].

శారద—[గుమ్మందాకా వెళ్లి దిగబెట్టి వస్తుంది].

వేణు—వదిలిపోయాడురా బాబూ! రిగ్యులర్ కేస్టరాయి లయి పోయాడు.

శారద—నీకు చాలా కష్టంగా ఉన్నదా? ఎంత ఎన్ లైటెన్డ్ (enlightened) గా డిస్కస్ చేసినాను! నీకు టెన్నిస్ విడిచిపెడితే ప్రపంచములో ఏ మున్నదో తెలియదు. ప్రోబ్లమ్సు ఆఫ్ సోషల్ లైఫ్ (problems of social life) నీ కేమి తెలుసు?

వేణు—నాకు పోలిటిక్సు-మీటింగులూ అంటే తలనొప్పి! హాయిగా ఇంటిపట్టున ఉండకూడదూ? ఇప్పటి కప్పుడే రెండు ఊళ్ళు తిరిగి వచ్చావు!

శారద—నేను వుమెన్సు కాజు (women's cause) కు నా లైఫ్, సేక్రిఫైస్ (sacrifice) చేసి పనిచేస్తున్నాను కదా! దానిలో ఉండే ఇంటరెస్టు నీ కేమి తెలుసు?

వేణు—మరి నాబోటి మాన్సుకాజు (man's cause) కూడా కాస్త చూడకపోతే ఎలాగ? పెళ్లయి వారంరోజు లయింది. ఇప్పటి కింకా హనీమూన్ (honey moon) అరేంజి చేయడానికే నీకు తీరుబడి అయింది కాదు!

శారద—నీకు హనీ కావలెనా? మూన్ కావలెనా?

వేణు—నాకు రెండూ కలిసిన హనీమూన్ కావాలి.

శారద—బాయ్‌ని పంపి హనీ రప్పిస్తాను. రాత్రి ఆకాశంపై చూస్తుకో మూన్ కనబడును.

వేణు—నీ ముఖంలోనే మూన్, నీ లిప్సు (lips) లోని హానీ కావాలి.

శారద—పోయట్ అయిపోతుండావే?

వేణు—మన మిద్దరం కలిస్తే పొయిట్రియే! మాట ఇలారా! దీనికి శుభముహూర్తమూ, లగ్నమూ చూడాలా ఏమిటి? మరి నీ బ్యూటీ (beauty) ఎవరికోసం?

శారద—బ్యూటీ ఫర్ బ్యూటీస్ సేక్ (beauty for beauty's sake) ఏ థింగ్ ఆఫ్ బ్యూటీ ఈజ్ ఎ జాయ్ ఫరెవ్వర్ A thing of beauty is a joy for ever) అన్నాడు కీట్సు... క్రిందికి పోయి ఫాదరు వచ్చారేమో చూచివస్తాను. [వెళుతుంది]

వేణు—శారదా! మాట! మాట! పోనీ బీచికి పోదామా?

శారద—[క్రిందినుండి జవాబు] సరేలే! ఫాదరు రానీ!

వేణు—అబ్బ! ఫాదరు ఉండాలి ఎప్పుడూ నీకు దగ్గర!

[తొందరగా క్రిందికి వెళతాడు.]

తెర.

---

ఓం!

బ్రహ్మకృపాహి కేవలమ్.

# వి డా కు లా?



## ఏడో రంగము



సమయం మధ్యాహ్నం 3 గంటలు,

[కామశాస్త్రి ఇల్లు; సీతమ్మ ఒక్కర్తె కూర్చొని పూసలు గుచ్చుకుంటూ ఉంటుంది. చుట్టుచెంగావిచీర, రవిక, సామాన్యవేషం. 'తలుపు,తలుపు'' అని కేక వినబడుతుంది. సీతమ్మ 'వచ్చె వచ్చె' అని

వెళ్ళి తలుపుతీస్తుంది. కామశాస్త్రి, రత్నం, ప్రవేశం. రత్నం కద్దు చీర, కద్దరురవికె ధరించి ఉంటుంది. ఒకకూలివాడు చిన్నసూటుకేసు మూటా తెచ్చి ఒకవారగా ఉంచి కామశాస్త్రి డబ్బియ్యగా తీసుకొనిపోతాడు. కామశాస్త్రిది అయిదోరంగంలోవలె ప్రయాణపువేషం.]

సీతమ్మ—[రత్నంతో] నిన్ను తీసుకొని వెళ్ళిపోవచ్చేరేమే? ఒంట్లో ఏమి లేదుకదే? నింపాదిగా ఉన్నావా?

రత్నం—[ముఖంలో నిరాశ] ఆ! నింపాదిగానే ఉన్నాను.

సీతమ్మ—[భర్తతో] దీన్ని తీసుకొచ్చారేమి? మీరు గుంటూరు కూడా వెళ్ళా రేమిటి?

కామ—ఏదీ కొంచెం మంచితీర్థం! కాళ్ళుకడుక్కొని వస్తాను. [వెళతాడు]

సీతమ్మ—[రత్నంతో] అమ్మా! నువ్వుకూడా కాళ్ళు కడుక్కొని మొగాన్నింత బొట్టు పెట్టుకో! ఆ దిడ్డీగూట్లో వుంది, కుంకం భరిణ. [కూతురు వెళ్ళగా సీతమ్మ పూసలువగైరా లన్నీ తీసేసి, చెంబుతో మంచినీళ్ళు తెచ్చిపెడుతుంది. కామశాస్త్రి వచ్చి కూర్చొని దాహంతాగి] అబ్బే! వెధవ రైలు అంతా మాలకూడే నే! సర్వం శ్రీ జగన్నాథం! [రత్నం వచ్చి పక్కగా నిలబడుతుంది]

సీతమ్మ—అసలు దీ న్నెందుకు తీసుకొచ్చేశా రిప్పుడు? చదువు పాడుచేసి!

కామ—మునసబుగారు కబురంపలేదూ? వ్యవహారం చెడింది, పిల్లని తీసుకొని ఇంటికి వస్తున్నానని కబురు చేయించమన్నాను.

సీతమ్మ—కబురూ లేదు కాకరకాయా లేదు. పదిరోజులాయె వెళ్లారు. ఏమయ్యారో, ఎక్కడున్నారో, ఏభోగట్టా అయినా తెలిస్తేనా? ఇన్నాళ్లు ఆలస్యం అవడంచాత ఏదో దారి కొస్తూం దేమో అనుకొన్నాను. ఇన్నాళ్లేంచేస్తున్నారు?

రామ—బందరులో మునసబుగారి వియ్యంకు డున్నాడు కాడూ! అక్కడ మనకి కొంత వార్షికం ఉంది. వాళ్ళింట్లో ఉంచేశారు. ఇల్లు కదిలాక నాలుగుపనులూ చక్కబెట్టుకోవాలా ?

సీతమ్మ—అసలు జరిగిం దేమిటి ?

రామ—మునసబుగారు శ్రీమపడి వచ్చారా ? ఆయనవచ్చినా గడ్డిపరకంత ఖాతరుచేశాడుకాడు సుమా ! ఎంత పొగరుపోతుతనంగా ఉందనుకొన్నావు వాడిపనిప్పుడు ?.........దీన్ని మొగుడు మళ్ళీ పెళ్ళి చేసుకొన్నాడట -

సీతమ్మ—ఆఁ! నిజంగానే ! [రత్నంవేపు చూస్తుంది. రత్నం దుఃఖంతో లోపలికి వెళుతుంది].

రామ—బి. య్యే. చదువుకొన్న పిల్లట - తండ్రి వెళ్ళలేదు. ఎవరూ వెళ్ళలేదు.

సీతమ్మ—పెళ్ళేమిటి ? పెడాకులు ! కర్పూరపుపేర్లో పువ్వుల దండలో వేసుకొని పెళ్లయిం దనుకొన్నారు కాబోలు.

రామ—ఇకమీాద పెళ్ళిళ్ళిలాగేనట! పౌరోహిత్యాడే అక్కర్లే దట ! బాజాభజంత్రీలకి బదులుగా ఫోనోగ్రాపు పెట్టేసుకుంటారట. అటువేపు ఇంకో చిత్రం విన్నాను. కమ్మవారిలోనూ రెడ్లలోనూ ఏ కులానికి ఆ కులంవాళ్లే పురోహితులట -

సీతమ్మ—ఎంత దారుణపుపని చేశాడు !

రామ—అందుచేత, మునసబుగారి నడుగుతే దావా పడేయ డమే సాధన మన్నారు. పిల్ల ఇక్కడవుంటేనేగాని దావా మెలాగ ?

సీతమ్మ—అంతా యింతకాడికి వచ్చిందికదా ! ఇంక దావా, భరణం ! అయ్యోరాతా ! మొగుడుబతికుండగా భరణంగతే మొచ్చిందే స్నికూ !

రామ—ఆ గుంటూరులో బరిలోవాళ్లు ఓ పట్ల దీన్ని విడిచి పెట్టారా! అవన్నీ నన్ను తీసుకెళ్ళి చూపెట్టారు. ఒకసంగీత మేమిటి ! సంస్కృత మేమిటి ! హింందూస్తానీ ఏమిటి ! ఇంగిలీ షేమిటి ! అన్ని

భాషలూ నేర్పుతారట! అనేకరకాల అల్లికపనులు...ఊళ్లవాళ్ళ నుంచి వచ్చి ఆడపిల్లలు చదువుకోడం- అందరికి కద్దరు గుడ్డలే!

సీతమ్మ—బంగారులాగు చదువుకుంటూన్న పిల్లని తీసుకొచ్చా శారమ్మా!

కామ—ఇప్పు డేమీ చదువూ సంధ్యా చెప్పడంలేదు. ఇంక సెలవు లిచ్చేస్తారట. అవేవో మీటింగులట! నాటకాలట. దీనిచేత ఒక వేషం వేయిస్తారట, ఆ మీటింగులన్నీ అయేదాకా పంపించ నంటారు వాళ్ళు- ఆఖరికి ఒక పెద్దదెబ్బలాట దెబ్బలాడేసి తీసుకు వెళ్ళిపోవచ్చాను.

సీతమ్మ—అది మీకు నేర్వాలా ఏమిటి? ఇంతలో దావాకేం మునిగిపోయింది? ఆ పరీక్షేదో అయినతరువాతే తీసుకొని రాలేక పోయారా?

కామ—పరిక్షలేమిటీ నీమొహం! నాటకాల్లోనూ భాగోతాల్లోనూ వేషాలు వెయ్యడానికా పంపించావు? మళ్లా వెళ్లడానికి రైలుఖర్చులు ఎవరు పెట్టుకొంటారు? ఇప్పటికే అంతా ఒకపక్షం వదిలిందికదా!

సీతమ్మ—బాగానే ఉంది! వెళ్ళి స్నానం చెయ్యండి... ... అత్తెసరు పడేస్తానూ!

కామ...అక్కరలేదు. ఏకంగా రాత్రే) భోజనం [స్నానానికి వెళతాడు.]

సీతమ్మ...అమ్మా! రత్నం! కాస్త పొడిఅన్నం మూతపెట్టి ఉంది; రా! తినేద్దుగాని -

రత్నం...[మెల్లగా వచ్చి నిలబడుతుంది - దుఃఖంగా]

సీతమ్మ...ఎందు కమ్మా! విచారిం చేమిటిలాభం! [తాను కూడా కంట నీరు తెచ్చుకొని] ఏం కష్టంవచ్చిందే అమ్మా నీకూ! నీ కష్టాలు చూడకుండా నేను చచ్చిపోయానుకానే!

రత్నం...ఇంక నా రాత ఇంతేనా?

సీతమ్మ——ఈయనమాటల కేమిటే! మీనాన్న మాటలు విని నువ్వు బెగిలిపోకు!

రత్నం...ఇం కేముంది! అంతా అయిపోతే!

సీతమ్మ...అన్నయ్య వెళ్లాడు కాడటే! అన్నయ్య అలా జరగ నిస్తాడా?

రత్నం-చదు వన్నారు; ఆర్మనీ అన్నారు; దానికీ లాభం లేక పోయింది. పైకి చదువు చెప్పిస్తే మంచిదని గుంటూరు పంపిస్తే అక్కడి కదీ సొంతం కాలేదు.

సీతమ్మ...అక్కర లేదమ్మా! చూడూ! అన్నయ్యకి ఉత్తరం వ్రాయించి నిజమైన భోగట్టా రప్పిస్తానుండు. ఇక్కడ జరిగిన భోగట్టా అంతా వ్రాస్తే అతనే చేస్తాడు తగిన ఉపాయం.

రత్నం...మునసబుగారితో స్పష్టంగా చెబితే ఇంకా అనుమాన మేమిటి?

సీతమ్మ...అయితే మాత్రం ఏమిటే! మగాళ్ల కేమిటి మహా రాజులు. ఎన్ని పెళ్ళిళ్లయినా చేసుకొంటారు. ఈ పెళ్ళిహాటి మహా శాశ్వతమా ఏమిటి ?

రత్నం...పోవే! నీకబుర్లా నువ్వాను. నుదుటవ్రాసిన వ్రాత ఇంతే! నేను చచ్చిందాకా 'స్వాములారిపెళ్లాం వెధవముండా కాదు పునిస్త్రీది కా దన్నట్లు మీ యింట్లో పడుండాలి. ఎవరి రాత ఎవరు తప్పించగలరు ?

సీతమ్మ——కాస్త ఓపికపట్టవే! అన్నయ్యదగ్గరనుంచి కబు రొచ్చేదాకాను! నువ్వు అలా అధైర్యపడుతూంటే నా కడుపు తరుక్కుపోతుంది.

రత్నం...కడుపు తరుక్కుపోయి ను వ్వేం చేయగలవు? నువ్వు చేసే ప్రయత్నమంతా స్వతంత్రించి చేయనేచేశావు. నాకర్మానికి నువ్వు కర్తవా ఏమిటి ?

సీతమ్మ..ఈ తగువు వచ్చినదగ్గరనుండీ మనస్సు మనస్సులో లేదు సరికదా, తిండికూడా నోటికి వెళ్ల లేదంటేనమ్ము! ఇలా......గ

బెంగలుపెట్టుకుపోయి- నలుసులా ఒకపిల్ల! ముద్దుముచ్చటా, సుఖంగా కాపరం, పిల్లామేకా లేకుండా, ఈ ఖర్మం వచ్చిపడిందేమి దేవుడా అని అహోరాత్రాలు నేను పడే మనోవ్యాధి ఆ భగవంతుడికి తెలుసు; వేయి దేవుళ్లకి నేను మొక్కే- మొక్కులకి లెక్కా- గురీ లేదు.

రత్నం... ఆవూళ్లోఉన్నానా అమ్మా! ఇన్నాళ్లూనూ- ఓపండుగనీ, పబ్బమనీ, నోమనీ వ్రితమనీ ఊళ్లో ఆడవాళ్లు ఎంతో అందరగా పువ్వులు ముడుచుకొని, రకరకాలచీరలు కట్టుకొని, నగలూ నాణాలు పెట్టుకొని తిరుగుతూంటే చూసేదాననా! ఎందుకీ పనికిమాలిన బతుకు- ఏనూతిలోనో పడి ప్రాణం విడిచేద్దామా అనిపించేదే!

సీతమ్మ... నాకే అలా ఉందికదా! నీ కుండడం అబ్బురమా అమ్మా!

రత్నం... [కన్నీరు తుడుచుకొంటూ] ఎప్పటికేనా మంచి దినాలు రావా అని ధైర్యం తెచ్చుకొని మొండిఘటాన్నయి ఉంటున్నాను.

సీతమ్మ——[రత్నం కళ్ళు తుడుస్తూ] అదే మంచిదమ్మా! ఎప్పటికేనా ఆ ధైర్యమే మంచిది. నీకన్నా మొండిఘటాన్నయి నేను తిరుగుతున్నానుకానూ! మీనాన్నకి ఇన్నేళ్లువచ్చినా జ్ఞానం లేదు సుమీ! ఎవరితో చెప్పను నాకష్టాలు.

రత్నం——నాన్న ఇలాటివాడు కాబట్టే నా కీ అర్ధమర్ధాంతరం పెళ్ళి వచ్చింది. వైధవభరణం ఎవరి క్కావాలి! చదువుకొని ఏగర్ల స్కూలు మేష్టరీపనో చేసుకొంటే నాకడుపు గడిచి పోతుంది.

సీతమ్మ——నేను దెబ్బలాడుతానుండు-మీనాన్నతోనూ! మనిషికెంత తోస్తే అంతేనా? మంచీచెడ్డా ఒకరు చెప్పడం, వినడం, అక్కర్లేదూ?

రత్నం——ఇటుపైని ఆశ్లీడర్లదగ్గరకీ, కోర్టులకీ నన్ను తిప్పి చంపుతాడుకాబోలు. ఇకమీద ఇదో బతుకు. ఈ డబ్బంతా నెత్తిని కట్టుకు పోతాడేమిటిచెప్మా! నాకు దావాలు వద్దు. దసనాలువద్దు. మళ్లా నే నా

గుంటూరుపోయి అక్కడే చదువుకుంటాను. మొగుళ్ళు చచ్చిన పిల్లలు పదిమం దక్కడ చదువుకొంటున్నారు- వాళ్ళతోబాటు నే నొకర్తెని-

సీతమ్మ—ఏమిటా ఓఘాయిత్యం మాటలు! అలా అనుకో కూడదు. నేను నచ్చచెప్పి మీనాన్న మనసు మళ్ళిస్తానుకాదూ!

రత్నం—చచ్చినా, నే నాప్లీడర్లదగ్గరకీ కోర్టులకీ వెళ్ళనే! ఏం చేస్తాడో చెయ్యనీ! ఆ గుంటూరువచ్చి, ఆ శారదా నికేతనంలో నానాఅల్లరీని; వాళ్ళందరూ నవ్వడం; వీరు మీ నాన్నగారా అని వాళ్ళడగడం; నా ఒళ్ళు చచ్చిపోయిందంటే నమ్మ!

సీతమ్మ—అయ్యో తల్లీ! నువ్వు బయలుదేరిన నాడు రాత్రి మా కింట్లో తిళ్లూతిప్పలూ లేవే! చీపురుకట్ట పట్టుకొని ఒళ్ళు హూనం చేశారంటే నమ్మ- ఇరుగుపొరుగువాళ్ళు రావడం నానారసాభాసూ అయింది.

రత్నం—నాటకంలో సావిత్రివేషం ఇచ్చారే! వేషాలన్నీ ఆడ పిల్ల లేన్లే! ఆనాటకం చెడిపోతుందీ, పదిరోజులూపా టుంచమని వాళ్లెంత బతిమాలినా ఒప్పుకొంటేనా? ససేమరీ!

సీతమ్మ—సావిత్రికిలాగే నీమొగుడూ వస్తాడూ! ధైర్యం తెచ్చుకో! లే! పోదాం! మీనాన్న స్నానం అయిపోయి వచ్చేస్తు న్నారు? అన్నానికి రా!

రత్నం—మరి అన్నయ్యకి ఉత్తరం రాయిస్తావా?

సీతమ్మ—నువ్వే రాద్దూగాని, అమ్మా! నేను దగ్గరుంటి చెప్పి రాయిస్తానుకాదూ! ఇలాగ- మునసబుగారు వెళ్ళినా లాభం లేక పోయింది; నాన్న భరణానికి దావా పడేస్తానని తొందరపడుతున్నారు, వెంటనే తగిన ఏర్పాటు చేసి బయలుదేరి రమ్మనే రాదాం. పద పోదాం. మీనాన్న వచ్చేస్తున్నారు.

[వెళతారు.]

తెర.



ఓం!

బ్రహ్మకృపాహి కేవలమ్.

# విడాకులా?



## ఎనిమిదో రంగము

సమయం రాత్రి 8 గంటలు.

[శారద గది - వేణు మెల్లగా చక్కని రాగంతో "శారద రాత్రు లుజ్వల లసత్తరతారకహారపంక్తులన్, జారుతరంబు లయ్యె, విలసన్నవనందనగంధబంధురోదార సమీర" అని చదువుతూ, ఆ పై ముక్కలు రాక అవే మననం చేస్తూంటాడు.]

శారద—[నీటుగా తయారయి తొందరగా వచ్చి] వేణూ! ఏమి చేస్తున్నావు?

వేణు—[నిర్లక్ష్యంగా రాగం మార్చి] శారదరాత్రు లుజ్వల- [చదువుతాడు ఆమెకేసి చూస్తూ].

శారద—వేణూ!

వేణు—[శారద రాత్రులుపద్యం మరొక రాగంతో చదువుతాడు]

శారద—[విసుగుతో బిగ్గరగా] వేణూ!!

వేణు—[రాగంమార్చి అంతబిగ్గరగా అథార్టీతో శారద రాత్రులు పద్యం చదువుతాడు].

శారద—[ఐ సే! (I say) బి సీరియస్ (be serious)

వేణు—ఆల్ రైటు! సీరియస్! మానేశా నేమిటో చెప్పు!

శారద—[ఫాదరు రేపు హంపీయాత్రకి పోతున్నారు.

వేణు—రేపే!

శారద—అమూ! నీవద్ద నేమయినా మనీ స్పేరు (Sqare) గా ఉన్నదా ?

వేణు—ఏమ్మీ లేదు.

శారద—మీ ఫాదరు చాలా రిచ్ మాన్ పెద్దబాంకరు (Banker) అంటివే !

వేణు--అయితే మాత్రిం ఎంతకని పంపుతాడా బ్రామ్మడు! ఇవతల మన మెయింటినెన్సు (maintenance) కే పంపుతాడా ? నీ టూరింగుకే పంపుతాడా ?

శారద—నీకు మనస్సుకు చాలా కష్టంగా ఉన్నదా ? సరిద !

వేణు—అసలు వాళ్లబిజినెస్ అంత బాగులేదు. కాంగ్రిసు వాళ్ళు వాళ్లమిల్లు సర్టిఫై చేయలేదట; లాస్‌లో రన్ అవుతూంచట.

శారద— ఏదీ నీ సూట్‌కేసు తెరు !

వేణు—అసలు మీఫాదరు ఎందుకు అక్కడికి వెళ్లటం ? ఆ కంట్రీ అంతా పాడయిపోయిందట మహా కాటకం పట్టి

శారద—ఫామిన్ (Famine) ఏరియా కూడా చూసిరా రమ్మని చెప్పినాను ఫాదరుతో- పెట్టె తెరువుమీ !

వేణు—[పెట్టె తెరచి మనీపర్సు శారద చేతి కిస్తాడు].

శారద—ఫిఫ్టీ రుపీస్‌దా ఉన్నది?

వేణు—అంతే ! మళ్లా రేపు నువ్వు ఎక్కడో టూరింగుకి కావాలంటావని ఇవాళ ఉత్తరంకూడా రాస్తున్నాను మనీకోసం !

శారద—దట్ ఈజ్ రైటు (that is right) ఉంచుకో ! ఫాదరుకి చాలా మనీ కావాలె! ఇది చాలదు. [మనీపర్సు ఇచ్చివేసి క్రింది కి వెళుతుంది. వేణు సూటుకేసు మూసి ఏదో ఆలోచిస్తూండగా పరికాశం ప్రవేశించి నమస్తే అంటాడు].

వేణు—రండి! రండి! ఇంకా మీరు రాలేదనే చూస్తూన్నాం!

ప్రకా— ఈరోజున బయలుదేరి ఇంటికి వెళదా మనుకొన్నాను. ఇంటిదగ్గర కొన్నిచిక్కులున్నాయని ఉత్తరం వచ్చింది. ఒక

సార్ మిమ్మలనీ శారదాంబగారినీ చూసి సెలవు పుచ్చుకొని వెళదా మని ఆగిపోయాను.

వేణు--మీ రిప్పుడే వెళ్ళిపోతే ఎలాగ? శారద మీరు రాలేదని చాలా ఆతు్రతపడిపోతూంది. కాలుకాలిన పిల్లిలాగు తిరుగుతూంది.

ప్రకా—అంత ఆతు్రత కేం వచ్చిం దిప్పుడు?

వేణు—ఏమో! ఆవిడప్రోగ్రాములు, ఆవిడటూరింగులూ, ఆ పోలటిక్సు నాతో ఏమయినా చెబుతుందిగనుకనా?

ప్రకా—మిమ్మలిని సలహాచేసి మీ అనుమతి తీసుకోరా!

వేణు—అనుమతి! అసలు చెప్పనేచెప్పదు! నాతో ఎప్పుడు చెప్పినా ఒకటేమాట! వేణూ! మనీకావలె, నేను బెంగుళూరుపోవలె, మంగళూరుపోవలె; మధురపోవలె మశానంపోవలె; పెళ్లయి పది హేనురోజులు నిండా కాలేదు. ఈలోగా అరడజను సార్లు టూరింగు, అయిదువందలుఖర్చుఅయింది. ఇంటిపట్టున ఒక్కపూటయినా హాయిగా ఉండడం కనబడదు.

ప్రకా—ఉన్నతవిద్య నభ్యసించి స్త్రీస్వాతంత్ర్యోద్యమ మొకటి నెత్తిమీద పెట్టుకొని ప్రబోధమూ ప్రచారమూ చేస్తూన్నప్పుడు ఆమాత్రం వ్యయమూ తప్పదు విరామం లేకుండా సంచారమూ తప్పదు.

వేణు—ఏమి ఎడ్యుకేటెడ్ వైఫండీ! ఒకనాటి కొకనాడు వైటు ఎలిఫెంటయిపోతూంటే ఎలాగ? వెనకటికి ఒకటీచరుని ఓ క్రిస్టియన్ గర్లు పెళ్లాడతానంటే నా కిచ్చే ఎనభయిరూపాయలూ నీకొక్కగానుకి చాలవు, న న్నిలాగు విడిచి పెట్టేయితల్లీ అని ఒక నమస్కారం చేశా డట ... నేను గనక, మాఫాదరు రిచ్మాన్ గనక దీన్ని భరిస్తున్నాం గాని ఎవడితరమండీ!

ప్రకా--మీరు వివాహం చేసుకోనేముందు వీ టన్నికీ సిద్ధపడే చేసుకొని ఉంటారుగనుక బాధలేదు.

వేణు—ఏదో కొంతసిద్ధపడ్డాననుకోండి. ఇంత అన్యాయంగా ఉంటుందనుకోలేదు. మొదటినుంచీ మనిషి రిజర్వ్డులెండి. టెన్నిస్

పార్ట్నర్‌గా ఉన్నప్పుడుకూడా, ఆ మేచెస్ టైములో అందుకు సమ్మంధించిన వేవో రెండుమాటలాడడం తప్ప అనవసరమయిన సంభాషణకి అవకాశ మిచ్చేదికాదు. ఎంత ఇదయినా ఇంతడబ్బు పెడుతూన్నప్పుడు బొత్తిగా ఇంత అన్యాయమా! ఈమధ్య ఒకనాడు జ్వరంవచ్చింది. గొడ్డళ్లతో కొట్టినట్లు తలపగిలిపోయింది; దగ్గరకొచ్చి తనచేతితో అమృతాంజనమయినా రుద్దలేదుసుమండీ! ఒక నర్సు నప్పగించేసి చక్కాపోయి పడుక్కుంది. ఇంతో అంతో భార్య అయిన తరువాత కాస్త వంటిమీద చేయివెయ్యడం ఉపచారం అంటూ ఉంటాయా? [అడుగుల చప్పుడు వినబడుతుంది] వస్తూందికాబోలు. ఇవేమీ అన కండేం! మోస్టు కాన్ఫిడెన్షల్! నాకు ఒళ్లు మండిపోయి అన్నాను.

పరీకా—ధర్మమా! తమమనస్సెంతో కష్టపడి ఉంటుంది; పాపం!

వేణు—ఏమండీ! మీకాంగ్రెసువాళ్ళు మాఫాదరు మిల్లు స్ట్రైకై చేయ లేదట!

[శారద ప్రవేశం.]

పరీకా—నూలు స్వదేశీకా దేమో!

శారద—వచ్చినారా సూర్యంగారు!

పరీకా—ఇప్పుడే వచ్చానండీ-

శారద—ఫాదరు రేపు హంపీయాత్రకు పోతున్నారు- ఏమండీ, మీరువస్తే అంతా తెలుగుమాట్లాడే దానికిదా బుద్ధిపుట్టును. మీరు లేకపోతే ఇంగ్లీషుమాటలు మామూలుగా వచ్చును.

పరీకా—నన్నుకూడా ఆ ప్రాంతం తీసుకుపోతే బాగుండును. ఆ రాయలసీమలో మహాక్షామం వచ్చి ఎంతోనష్టం కలిగింది. వాళ్లకి సేవచేయలేనిజన్మ ఎందుకు? మన ఆంధ్రు లక్కడ మహాఘోరమయిన కష్టాలతో ఉంటే మన కిక్కడ సుఖజీవనమా?

వేణు—[ఏదో ఉత్తరం వ్రాసుకుంటూ ఉంటాడు.]

శారద—నాకు కూడా పోదామనిదా ఉన్నది. పాపం! అక్కడ ఎంతమంది స్త్రీలు తిండిలేక ఇండ్లు లేక బాధపడుతున్నారు!

ప్రకా—స్త్రీలేమిటి? పురుషులేమిటి? చిన్నపిల్లలేమిటి? ఆబాల గోపాలమూ ఆకలిమంటలతో అల్లల్లాడిపోతున్నారు. అష్టైశ్వర్యాలతో తులదూగి ఆంధ్రభోజుడు స్థాపించిన రామరాజ్యానికి ఎన్నిపాట్లో చూడండి!

శారద—పాపం! మీరు చెపుతూఉండగా వినేదానికిదా కష్టంగా ఉంది. వేణూ! హంపీ పోదామా? సూర్యంగారినికూడా తీసుకొనిదా పోవలె-

వేణు—ఓ! ఒక్కహంపీ అన్నమాటేమిటి? అక్కడనుంచి అలాగ లేపాక్షి, ఎల్లోరా, ఇంకా మీదికిపోతే అజంతా, మొహెంజొదారో, ఇవన్నీకూడా తిరిగివద్దాం.

శారద—వేణుకి మనీ సెలవయిపోతుందని బయమ్! నన్ను మారేజి చేసుకొన్నదిదా వేణుకి నిండాకష్టం!

వేణు— అబ్బే! కష్టమేమిటి? పరమసంతోషంగా ఉంది. మహానందంగా ఉంది. నీ లెక్చర్లకీ టూర్సుకీ ఉమ్మెత్తిగాడిలాగు వెనకంగుకి రమ్మనకుండా ఈమాత్రం విడిచిపెడుతున్నావు. అదెంత కాదు.

శారద—ఉమ్మెత్తిగాడంటే?

ప్రకా—మావేపు భాగోతాలలోనూ, భోగం మేళాల్లోనూ ఉమ్మెత్తి ఊదుతూ ఒకడుంటాడు. దానికే బాగ్ పైప్(bag pipe) అంటారు ఇంగ్లీషులో.

శారద—తమాషామనిషిగా ఉన్నాడే వేణు!

వేణు—విమలాభాయని నాటకాల్లో వేషాలేస్తుంది మీకు తెలుసునా?

ప్రకా—ఎరగనండి!

వేణు—ఆవిడ నాటకాల్లో వేషాలెయ్యడానికి ఊళ్లంట వెళుతూంటే ఆవిడమొగుడుకూడ ఆవిడ వెనకాల తిరుగుతూ పిల్లలకి అన్నం పెట్టడం, తలదువ్వడం, నీళ్ళుపోయడం, గుడ్డలు తొడిగడం, అడ్డమయినచాకిరీ అతనిదే! ఆవిడ చక్కా యాక్టర్లతో బాతాఖానీ కొడుతూ కూర్చుంటుంది.

శారద——మంచిపనిదా! ఇదంతా మగవాడు ఎందుకు చేయకూడదు?

పత్రికా——ఇప్పుడు దొరసాన్లం తేనండి! పిల్లలని కని వాడుల కప్పగించేస్తారు.

శారద——[వేణుతో] ఎక్కడికీ పోకుండా ఆల్ ది ట్వెంటీ ఫోరవర్సూ ఇక్కడనే నీముఖం చూస్తూ కూర్చోవలెనంటావా?

వేణు——[మాటలాడడు.)

పత్రికా——హిందూసంఘంలో భార్యాభర్తలకి అటువంటి పరస్పర సంబంధం అనుశ్రుతంగా వస్తూందికాదండీ! అందుచేత వారలా అనుకోడం న్యాయం. అనుశ్రుతంగా వస్తూన్న అభిప్రాయాలు ఒక్కసారి ఎలా మారిపోతాయి.

శారద——నేను ఓపెన్‌గా చెప్పలేదూ వేణూ నీకు? నిన్ను ఫ్రెండుగా మాత్రం ట్రీట్ చేస్తానని. ఆర్డినరీ వైఫ్ మాదిరి నీవే నాకు భగవంతుడు, దేవుడు, నేను నీ పాత్రివ్రత్యనిని అనే వృత్తి నాది కాదని చెప్పలేదూ! మ్యారేజికి ముందుగా ఆ కండిషన్ను ఆక్సెప్టుచేయలేదూ నీవు?

వేణు——(జవాబు చెప్పడు )

శారద——నాకు వైఫ్ అనిపించుకొనే దానికే ఇష్టంలేదు. వైఫ్! ఏమి వైఫ్? వైఫ్ అనేమాటకు స్లేవ్ అనే అర్థం అయిపోయింది. నేను నీకు ఒక కంపేనియన్‌దా! ఏ కామ్రేడ్! ఎ పార్ట్నర్ ఇన్ లైఫ్ ఆఫ్ ఈక్వల్ స్టేటస్ (A partner in life of equal status) తెలిసిందా?

వేణు——తెలిసింది ! బాగా తెలిసింది.

పత్రికా——[శారదతో] ఇప్పుడదంతా ఎందుకండి అనవసరం!

శారద——[కోపంగా వేణు వేపు చూస్తుంది.]

పత్రికా——ఇవాళ నాకోసం చాలా ఆతురతగా ఎదురుచూచారట. ఏదైనా విశేషం ఉందా! [వేణు భయంగా చూస్తాడు.]

శారద——వాటీజ్ దిస్ ? మీకోసం నా కెందుకు ఆతురత ? ఎవరు చెప్పినారు?

పత్రికా—మీభర్త గా రన్నారులెండి ?

శారద—వేణూ? ఎక్స్క్యూస్ మి [వెటకారంగా] బర్త గారూ? ఏమి చెప్పినారండీ ?

వేణు—[జవాబు చెప్పడు.)

శారద—నేనుసూర్యంగారికోసంసింండాఆతృతగాఎదురుచూచి నానని చెప్పినారా? నిండా మంచి బర్త గారండీ మీరు? ఒక నాటి కొకనాడు నిండా తమాషామనిషిగా తయారవుతున్నా రే? ఏమండీ బర్త గారూ ఈమాదిరి అబద్ధాలు చాలా నేర్చు తున్నా రే ?

పత్రికా—మీకు ఈమధ్య ఎక్కడికేనా ప్రయాణం వుందా ?

శారద—బర్తగారట ! బర్తగారు !

పత్రికా—మా తూర్పుజిల్లాలకు మీ రెప్పుడూ రా లేదు.

శారద—లేదండీ ! మాఫాదరు చాలాకాలం రాజమండ్రీలో ఉన్నప్పటికీ నేను రానేలేదు.

పత్రికా—మీ స్త్రీ ఉద్యమవిషయంలో మావిశాఖపట్నంజిల్లా చాలా వెనుకబడిఉంది. అక్కడ మీ ప్రచారం చాలాఅవసరం.

శారద—చూడండీ ! ఒక పబ్లిక్ కాజుకొరకు వర్కుచేసేసమయంలో ఎంత ఎంకరేజుమెంటుఉండవలె ? వేణు నా ఎంతూజియాజమ్ అంతా కూల్ డౌన్ చేస్తున్నాడు,

పత్రికా—ఆయనమాత్రం వెనుకతీయకుండా మిమ్మల్ని అనేక ఊళ్లు పంపుతున్నారు కారూ ? స్వతహాగా డబ్బు పెట్టుబడి పెట్టేవాళ్లకి కొంచెం కష్టంగా వుంటుంది. ఆమాత్రం విసుగుదలకి మీరు చిన్న బుచ్చుకుంటే ఎలాగ ?

శారద— మీవూరు రమ్మంటారా ?

పత్రికా—తప్పకుండా ! మీకు అఖండమయిన స్వాగతం ఏర్పాటుచేస్తాం.

శారద—మీఊరిలో న న్నెవ్వరికీ తెలియందే! మీరుకూడా వచ్చి ఇంట్రడ్యూస్ చేస్తారా ?

ప్రి౯కా—విధిగా! అంతకంటేనా! లేకపోతే ముందుగా మీ పరిచయం కలిగిస్తూ అక్కడ ముఖ్యమైనవారి కుత్తరం రాసేదా?

శారద—అక్కడ స్త్రీలలో కొంచెం ఫార్వర్డుగా ఉన్నవారు లేరా?

ప్రి౯కా—ఉన్నారు; లేకేం! కాని వాళ్ళకి ధైర్యం చాలదు. మీవంటివారు వచ్చి ఒక ఉపన్యాసంతో ప్రోత్సాహం ఇచ్చారంటే అందుకుంటారు. ఆంతరంగికంగా ప్రతిమనిషిలోనూ కొంత ఉత్సాహం ఉంటుంది. దాన్ని నిప్పుఊదినట్లు ఊదితే రగులుతుంది. లేకపోతే అలాగే నుసిగట్టి ఆరిపోతుంది.

శారద—నాకు తెలుగులో బాగా లెక్చరుచెప్పేదిరాదు. మీ వూరిలో అంతా నవ్వుదురేమో?

ప్రి౯కా—ఉపన్యాసానికి జీవం ధార. మధ్యమధ్య కొన్ని ఇంగ్లీషు మాటలువస్తే రానీయండి. ఉపన్యాసబలంకాని ఫలితంకాని ఏమీ తగ్గదు. విషయం ప్రధానంగాని భాషలో ఏముంది? అయినా మీభాషకూడా ఇప్పుడు చాలా అభివృద్ధయింది.

శారద—అక్కడకూడా మీటింగులలో ప్రశ్నలువేసి అల్లరి చేసేవా రుంటారా?

ప్రి౯కా—అల్లరేమీ ఉండదు. ఎవరికేనా సందేహా లుంటే సభానంతరం బసలో కలుసుకొనేలాగు ఏర్పాటు చేదాం!

శారద—అదే మంచిది లేకపోతే స్పీచ్ ఎఫెక్టుపోతుంది.

ప్రి౯కా—అక్కడ ఒకమునసబుగా రున్నారు. చాలా ధర్మ శాస్త్రాలు తెలుసును. బహుశా దింపుతే ఆయనే కొంతచర్చలోకి దింపుతా రేమో.

శారద—సబ్జక్టు ఏమి కావలె లెక్చరుకి?

ప్రి౯కా—మీ యిష్టం.

శారద—విడాకులచట్టం ఒకటి ఉన్నది. మనుధర్మశాస్త్రం స్త్రీలకు చేసిన అన్యాయం ఒకటిఉన్నది. 'స్త్రీలవారసత్వం హక్కులు' ఉన్నది. సరే అక్కడికి పోయి నిశ్చయం చేయవచ్చును.

ప్రకా—మరి మావూరుప్రయాణం ఎప్పుడు ఏర్పాటుచేస్తారు.

శారద—రేపు ఫాదరు యాత్రకు పోతారుకదా! మరి మూడు నాలుగు దినాలలో పోవచ్చును. ముందుగా మీరు లెటరు వ్రాసి గ్రాండుగా మీటింగు అరేంజి చేయండిమీ!

ప్రకా—మంచిది. నాన్నగారింట్లోనే వున్నారు కాబోలు. వారి దర్శనం చేసికొని వెళతాను. (వెళతాడు.)

శారద—మంచిది. (గుమ్మందాకా దిగబెట్టి వెనక్కి వచ్చి) వేణూ! నీవు ఫాదరుతో నాగురించి ఏమయినా కంప్లెయింటు చేస్తివా?

వేణు—నీగురించి కంప్లెయింటేమిటి? నాసొద చెప్పుకున్నాను. పెళ్లంటూ చేసికొన్నాక ఈ నాలిగల బ్రహ్మచర్య మెన్నాళ్లని మొర పెట్టుకొన్నాను.

శారద—మన ఇద్దరికీ ఔట్ లుక్ లోనే భేదం వుంది. నేను ఆర్డినరీ వైఫ్ మాదిరి ఉందునని నీవు ఆశపడి ఉంటే నీకు డిసెపాయింటు మెంటు కలగవచ్చు.

వేణు—శారదా! నామీద నీకు కనికరం లేదు? నే నెంత ఆశ పడి నిన్ను మారేజి చేసుకొన్నాను! నన్ను ఇంత తృణీకరించి నలుగురిలో అగౌరవపరచినా నే నేమీ అనుకోలేదు. నీ అనుగ్రహం ఉంటే చాలు. నన్ను నువ్వు ప్రేమించలేదా! నా మీద ప్రేమ లేకపోడానికి నీకు నే నేవిధంగా లోపం చేశాను?

శారద—ప్రేమ! ప్రేమ!- అది చాలా పెద్దమాట- ప్రేమకు కావలసినది శరీరసౌఖ్యందానా? ప్లాటో చెప్పినమాదిరిగా ఒకరి నొకరు తాకకుండా ప్రేమించుకోకూడదా?

వేణు—నేను పడుతూన్న బాధ నువ్వు ఏమాత్రమూ గ్రహించావు కావు. అంత వేదాంతానికి నాబోటి మానవమాత్రుడు తాళ లేడు. నన్ను క్షమించు. నాబాధ కనిపెట్టు. అహోరాత్రాలు నీకోసం- నీ...ఏదీ ఒక్కసారి [కౌగలించుకోబోగా- శారద చేయి అడ్డుపెట్టి ఆపి]

శారద—ఎక్స్క్యూజ్ మి వేణూ! ఇంతమాత్రం తాళి ఉండ లేవే! నా యభిప్రాయం చెప్పి విడుస్తాను, విను! నీతో సంసారం చేసి

ఆ జీవనం గడిపేదానికి నే నింకా నిశ్చయించలేదు. నాకింకా పెద్ద పెద్ద హోప్సు ఉన్నవి. ఆ నిశ్చయం చేసుకొనే దినం వచ్చేవరకూ నీవు తాలిమి పట్టి వేచియుండవలె! నీబాధ నాకు తెలియును. అట్టిబాధ నాకు కూడా ఉండదా! అయితే అంతకంటె గొప్ప ఉద్దేశాలు మనస్సులో పట్టి ఈ ఆనిమల్ ఇన్‌స్టింక్టును వెనక్కి నెట్టుతున్నాను. ఆదినం వచ్చేవరకూ నిన్ను ఫ్రెండుగా మాత్రం ట్రీట్ చేస్తును.

వేణు—విస్తట్లో పంచభక్ష్యపరమాన్నాలూ వడ్డించి ఆపోశనకి అనుజ్ఞ ఇవ్వకపోతే ఎట్లా ఉంటుందో ఆలోచించు.

శారద—ఇంతదూరం చెప్పినా నీకు పట్టలేదా! అసలుసంగతీ- ఫాదర్ మనస్సుకి నిండా కష్టం కలిగినదానిచేత ఆయనను ప్లీజ్ (please) చేసే దానికిదా నే నీ మారేజి ఆక్సెప్టుచేస్తిని. అందుకదా ముందుగా నీతో కొన్నికండిషన్సు ఫిక్సప్ చేసియుంటిని. అదే చాలు అని నీవు ఆక్సెప్టుచేస్తివికదా!

వేణు—నువ్వు ఏమి చెప్పావు? నన్ను ఫ్రెండుగా ట్రీటు చేస్తానన్నావు. భార్యాభర్తల సమానత్వం మాత్రమే కోరావని నే నంగీకరించాను. నీ ప్రోగ్రాముకీ టూర్సుకీ అడ్డుపెట్టకూడదన్నావు. సరే అన్నాను. నీప్రయాణాలకి కావలసినంత డబ్బూ ఇస్తున్నాను. దాని కర్థం ఇదా? ఈ బ్రహ్మచర్యమా?

శారద—[నవ్వుతూ] ఫ్రెండుగామాత్రము ట్రీట్ చేస్తానంటిని. నీవు మంచిపిల్లకాయ- తాళిఉండు - ఫాదర్‌తో రిపోర్టుచేస్తే నా కేమి భయమా! ఫాదర్‌తో ఇదేసంగతి చెప్పి వినుస్తా!

[లోపలినుండి రామారావు- కేక - "శారదా! నీవూ వేణూ ఒకసారి ఇట్లా రండి"అని].

శారద—[వెళ్లుతూ] వేణూ! ఫాదరు పిలుస్తున్నారు.

వేణు—ఇంకా ఎందుకు చెప్పమ్మ!

శారద—[లోపలనుంచి] వేణూ శీఘ్రం రా!

వేణు—[ఆలోచనలో పడతాడు.]

శారద—[తిరిగి వేణూ! శీఘ్రం రా! అని కేక].

వేణు—సరిరా! ఆఖరు కిది అరవదంపయింది కాని—

[విసుగుగా వెళతాడు.]

తెర.

---

ఓం!

బ్రహ్మకృపాహి కేవలమ్.

# విడాకులా?



## తొమ్మిదో రంగము



సమయం రాత్రి 9 గంటలు.

[విజయనగరం కాంగ్రెసు ఆఫీసులో శారద బస; శారద తనలో పాడుకుంటూ తల దువ్వుకుంటూ ఉండగా ప్రకాశం ప్రవేశించి చాపలూ జంబుకానాలు సర్దుతాడు.]

శారద—ఏమండీ! వా రంతా ఎన్నిగంటలకు వస్తా నన్నారు?

ప్రకా—ఎనిమిదింటికే!

శారద—మనకు ట్రెయినుకు టైము వుంటుందా?

ప్రకా—కావలసినంత వ్యవధి. పదిన్నరకి రైలు. సామానంతా సర్దేసేవుంది.

శారద—నా లెక్చరుగురించి ఇంకా ఎవరే మన్నారు?

ప్రకా—ఉపన్యాసం చాలా బాగుందన్నవారే ప్రతివారున్నూ! సందేహ నివృత్తికోసం వస్తున్నారు. ఇదివర కనుకున్న మాటేకదూ!

శారద—ఎంతమందయినా రావచ్చును. ఎవరినో ఒక్కరినే మాట్లాడమని చెప్పండి. పదిమందీ పదిప్రశ్నలు వేస్తే అల్లరిగా వుంటుంది.

ప్రకా—అదే న్యాయం - తప్పకుండా అలాగే చేదాం.

శారద—ఈపోజున నాకు చాలా గొప్ప రిసెప్షన్ ఏర్పాటు చేసినారే! అది చూచి థండర్ స్ట్రిక్ అయిపోయినాను.

ప్రకా—మీ విలువ మీకు తెలియదు. మీయందు నాకు గల గౌరవం మరోవిధంగా ఎలా చూపించగలను ?

శారద—[వీధివేపు చూసి] ఎవరో వస్తూన్నట్లుంది.

ప్రకా—[చూసి] మునసబుగారులాగే ఉంది ఆ నడక చూస్తే!

శారద-వారందరినీ మీరు రిసీవుచేసుకోండి. నే నిప్పుడేవస్తాను.

ప్రకా—నే నదంతా చూస్తాను. మీరు వెళ్ళిరండి.

[ప్రకాశం జంబుఖానామీద కాగితం ముక్కలు ఏరుతూ శుభ్రం చేస్తూంటాడు. మునసబు వెంకటాద్రివు పంచ, చొక్కా, చేతికర్ర, నుదుటికి విభూతితో ప్రవేశం. కామశాస్త్రి మామూలు వేషంతో వెనకా లుంటాడు.]

వెంక—[ప్రకాశంభుజంమీద తట్టి] కామశాస్తుర్లూ! మీ వాడు మహాఘుట్టివాడయ్యా !

కామ—ఏమి ఘట్టండి. శుభ్రంగా చెడిపోయాడు.

వెంక—నువ్వింకా పెరటిదారినే ఉన్నావు. అత డెంతపని చేశాడో తెలుసునా ? మీ అల్లుడు పెళ్ళిచేసికొన్నపిల్ల ఈవిడేనట!

కామ—ఆఁ! ఎంతబాగా చెప్పిందండీ ఉపన్యాసం!

వెంక—ఆవిడ నిక్కడికి తీసుకరావడం అంతా ఒక పెద్ద ప్లాను; నీ కూతురి కాపరం నిలబెట్టడానికి.

కామ—అ దెలాగా ?

వెంక—చూస్తూఉండు నీకే బోధపడుతుంది. ఆవిడ లెక్చ్ సూ ... చేసు మాట్లాడుకొంటూన్నదీవిషయమే! అన్నట్లు ఆప దేదీ ? మనమాటలు వినబడవు కద!

ప్రకా—వస్తారు. స్నానానికి వెళ్లారు. [సీతమ్మ, రత్నం ప్రవేశం]

కామ—[సీతమ్మని దూరంగా పిలిచి] అమ్మాయి మొగుడు పెళ్ళిచేసుకొన్న దీవిల్లేనట -

సీతమ్మ—నిజంగానే! ఏమిటీ విడ్డూర్యం! అమ్మాయీ! నీ మొగుడు పెళ్లి చేసికొన్న దీవిడేనటే!

రత్నం—పోవే! నీమాటలూ నువ్వూను. అయితే ఇలా ఊళ్లంట తిరుగుతుందా?

సీతమ్మ—ఇందుకే కాబోలే! అన్నయ్య మనందరినీ రమ్మని కబురంపాడు.

ప్రకా—మునసబుగారు మన విషయంలో చాలా శ్రమపడుతున్నారు.

వెంక—మధ్యని నే పడుతూన్న శ్రమే ముంది?

ప్రకా—ఈవేళప్పుడు ఇంతవరకూ తమరు శ్రమపడి రావడం చాలదూ! మావాళ్ళు వ్రాశారు. తమరు మాచెల్లెలి మామగారితో మాట్లాడడానికి దయచేయ్యడం, ఆతరువాత మా చెల్లె లిక్కడికి వెళ్ళిపోయిరావడం ఈ విశేషాలన్నీని. ఆరాత్రే ఆవిడింటికి వెళ్లి, ఆవిడ నెలాగయినా ఇక్కడికి రప్పించి పరిస్థితులన్నీ ప్రత్యక్షంగా చూపిస్తే గాని కార్యం సానుకూలం కాదనీ—

వెంక—ప్లాను వేశావు. పాచిక పారింది.

ప్రకా—ఇప్పుడా భార్యాభర్తలకి మనస్పర్థలు కలిగాయనీ, ఆదర్శాలు ఛేదించాయనీ తమతో మనవిచేసే ఉన్నాను.

వెంక—సరే! ఉసి అందిచ్చావుకదా! చిన్ననాటక మాడిద్దాం! కామశాస్త్రుర్లూ! మీవాడినత్తువ ఇప్పటికైనా బోధపడిందా? ఇంట్లోంచి తగిలేసి నానాఅల్లరీ చేసికొని అనవసరంగా వీధినపడ్డావు.

కామ—తమవంటి పెద్దలదగ్గర బతుకుతున్నప్పుడు అనాచారం ఎలా సహించనరండీ!

వెంక—విను! మతమూర్ఖత ఒకటి, వర్ణభేదం, పిచ్చినమ్మకాలు- ఇంకా దేవుడు మేలుచేస్తే... సబువులేనివాదనలు, ఇవన్నీగ సముద్రాలు దాటివచ్చిన పరజాతులకంటెకూడా ఎన్నోరెట్లు రాక్షసంగా మనదేశాన్ని నొక్కిపారేస్తున్నాయని రవీంద్రనాథ ఠాకూరన్నాడు.

శామ--అప్పుడేదో ఆ వేళావిశేషం అలా జరిగిపోయిందికాని, సకల ధర్మశాస్త్రాలూ తెలిసిన తమవంటివారే ప్రాయశ్చిత్తం అక్కరలేదంటే నా కింక నిర్భయమే!

ప్రకా—ఆవిడ వస్తూన్నట్లున్నారు. ఒక్క మునసబుగారే సంభాషిస్తారు. తక్కినవా రెవరూ మధ్యమధ్య మాట్లాడకండి. [మునసబు, శామశాస్త్రి ఒకవేపూ, రత్నం సీతమ్మ ఒక వేపూ కూర్చుంటారు. ప్రకాశం నిలబడి శారదకోసం చూస్తూంటాడు. శారద చీర మార్చుకొని నీటుగా తయారయి వచ్చి నమస్కారంచేసి మధ్యగా కూర్చుంటుంది. మునసబుగారు కూర్చున్నవేపు ఆవిడకు దగ్గరగా ప్రకాశం కూర్చుంటాడు.]

వెంక—మీ లెక్చరు చాలా ధాటీగా ఉంది. మంచి ధార.

శారద—ఏదో స్త్రీలము కదా! లోపములు ఉండును.

వెంక—బాగుందమ్మాయి- లోపాలు కూడానా? అద్భుతంగా వుంది లెక్చరు. అయితే మావంటి పూర్వకాలం వాళ్లకి కొన్నిచోట్ల సప్రమాణంగా కనబడలేదు. వీలయితే ఆ సందేహాలు ముఖతా తీర్చుకుందామని వచ్చాను.

శారద—తప్పకుండా అడుగవచ్చును.

వెంక—చూడండీ! మీ లెక్చరులో, స్త్రీలకీ, భర్తలకి విడాకులిచ్చే స్వతంత్రత ఉండాలని చెప్పారు. అసలు మన దేశంలో "న స్త్రీ స్వాతంత్ర్య మర్హతి" అని సూక్తి ఉన్నది.

శారద—ఉన్నది, వింటిని. అది స్త్రీలను బానిసలుగా చేసేద్దానికి పురుషులు పెట్టిన ధర్మసూత్రం. స్త్రీకి ఆత్మా, హృదయమూ లేదా?

వెంక—లేకేమి?

శారద—స్త్రీకి ఆత్మా, హృదయమూ ఉన్నప్పుడు- ఇండి విడ్యు ఆలిటీ- [పత్రికాశంవైపు చూస్తుంది].

పత్రికా—వ్యక్తిత్వం.

శారద—స్త్రీకి వ్యక్తిత్వం ఉన్నదంటారా లేదంటారా?

వెంక—స్త్రీకూడా ఒకవ్యక్తి గనుక వ్యక్తిత్వం ఉంటుంది.

శారద—నీతి అందరకూ ఒకటియేనా? స్త్రీలకు వేరే నీతీ, పురుషులకు వేరే నీతి ఉండునా?

వెంక—సమానవ్యక్తులకి సమాన నీతిధర్మా లుండాలి.

శారద—స్త్రీలుకూడా సంఘంలో సమానవ్యక్తు లయినప్పుడు స్త్రీలకు వేరేనీతి పురుషులకు వేరేనీతి ఎందుకు ఉండవలె? పురుషుడు చినిగిపోయిన చెప్పువలె భార్యను విడిచి రోజు కొక పెండ్లి చేసికొన వచ్చునా? అత డెంతమంది సవతులను తెచ్చి పెట్టినా, ఎన్ని వ్యాధులు తెచ్చినా, ఎంత అన్యాయము చేసినా, స్త్రీకి చచ్చేవరకూ అతనితో బ్రతుకవలసిందిదానా? భార్య కాపరానికి తగిఉండగా, ఆమెకు తగిన కారణమయినా చెప్పకుండా, భర్త ఇంకొక పెండ్లిచేసు కుంటే, మొదటిభార్యకు వేరే నివసించేదానికి కూడా హక్కు లేదా? తమరు మనసబుగారుకదా చూడండీ! ఎంత న్యాయముగా ఉన్నదో మీ హిందూ లా-

వెంక—ముఖ్యమయిన విషయం ఎత్తుకున్నారు. హిందూ లాలో ఇదొక గొప్పలోపమే! ఇంకొక వివాహం చేసికొనేముందు భర్త తగినకారణాలు చూపించి కోర్టువారి అనుమతి పుచ్చుకొనేలాగు హిందూ లా మార్చడం చాలా అవసరం.

శారద—థేంక్స్—

వెంకట--కాని మీరు చెప్పేదాన్నిబట్టి వివాహం వట్టి బిజినెస్ ప్రొపోజిషన్ అయిపోతుంది.

శారద—వివాహమయిన స్త్రీ పురుషుల కెట్టి సంబంధ ముండవలె?

వెంకట—పురుషుడు భర్త - భరించేవాడు. స్త్రీ భార్య భరింపబడేది. ఆమాటలలోనే ఉంది దాని అర్థం.

శారద—అంటే స్త్రీకి వ్యక్తిత్వం లేదన్నమాట! ఫలానివాని భార్య అనేగదా ఆమెకు పేరు. ఆమె తనడబ్బుతిని బ్రతుకుతూఉన్నా-ఆమె భర్తకు ఒక ప్రాపర్టీఅన్నమాట! మనఇండ్లలో ఆవులు, గేదెలు మనకు ఆస్తులయినట్లే స్త్రీకూడా పురుషునికి ఒక ఆస్తిఅన్నమాటేనా? ఆమె జీవితమూ, ప్రవర్తన తన కిష్టమయినట్లుగా పురుషుడు మార్చుకోనేదానికి అధికార మున్నదికాదండీ-మరి స్త్రీకి వ్యక్తిత్వ మెక్కడా?

వెంకట—వివాహబంధనానికి ముఖ్యాధారం, ప్రేమనూత్రమని ఒప్పుకొంటారా?

శారద—అహా! అటువంటి ప్రేమ ఉన్నవాండ్లే పెండ్లి చేసికోవలె. చిన్నపిల్లలకి తలిదండ్రులు పెండ్లిచేస్తే "మీరు ఒకరి నొకరు తప్పకుండా ప్రేమించుకొని తీరవలె" అని శాసించేదిదా!

వెంకట—మాతండ్రి మేనత్తకి పదోనెలలో అన్నప్రాశననాడే పుస్తె కట్టారట. ఆవిడ ఎనభైయేండ్ల ముత్తయిదువుగా బతికి పుట్టిన బిడ్డల కనుక్కొని పునిస్త్రీచావు చచ్చిపోయింది. ఆదాంపత్యానికి ప్రేమకీ లోపం వచ్చిందా?

శారద—ఆ దినములు వేరు. భర్తయే దైవమనీ, రక్షకుడనీ అభిప్రాయంతో ఆమె కాపురం చేసివుండును. ఆభర్త ఆమెను ఎన్ని దెబ్బలు కొట్టినా, ఆత డెన్నితిరుగులు తిరిగినా ఆకా సహించి ఊరకనే యుండి కాపురం చేసివుంటుంది. ఆమెకు వంటయిల్లు దాటితే ప్రపంచమే లేదు. ప్రపంచంలో సమస్యలతో ఆమెకు ఏమీ సంబంధము కలగలేదు. ఊరకనే వంటచేసే దానికీ, పిల్లలని కనేదానికీ ఆమె మెషీన్‌గా ఉండిపోయెను. ఇప్పుడు ఆ ఐడియల్ (Ideal) మారిపోయినది కదండీ! స్త్రీలు విద్య నేర్చుకొన్నదానిచేత మేముకూడా ప్రపంచంలో మనుష్యులందా! మేముకూడా సంఘంలో వ్యక్తులందా! భగవంతుడు స్త్రీలను పురుషులను సమానంగా సృష్టి చేసినాడుకాని,

స్త్రీలను పురుషులకు దాసీలుగా ఉండేదానికి సృష్టి చేయలేదని జ్ఞానం కలుగుతూన్నది కాదండీ!

వెంకట—సరే! మీరు చెప్పేది బోధపడింది. ఇప్పుడు స్త్రీలకు పతి దైవసమానుడు కాడు, పాతివ్రత్యం అక్కరలేదు. స్త్రీ పురుషులు సమాన ధాయాలో ఉన్న స్నేహితులు. సమాన భావం ఎప్పుడు కలిగిందో అప్పుడు ఒకరి కొకరు లొంగి ఉండరు. గనక ఫెమిలియారిటీ బ్రీడ్సు కంటెప్టు (Familiarity breeds contempt) అన్నట్లు అతి చనువు విరసంగా పరిణ మిస్తుందంటారు. అటువంటి పరిస్థితులలో ఒకరి కొకరు విడాకు లిచ్చుకోడానికి లాలో హక్కు ఉండాలంటారు. అంతేనా?

శారద—చక్కగా చెప్పినారు. అంతదా నా పాయింటు.

వెంకట... మరి మన దేశంలో విడాకులచట్టం అమలులోకి వస్తే, భార్యాభర్తలలో ఒకరిమీద ఒకరికి విశ్వాస ముంటుందా? భార్యా ఎప్పుడు విడాకు లిచ్చి పోతుందో అని భర్తా, భర్త ఎప్పుడు విడాకు లిచ్చేస్తాడో అని భార్యా, ఒకరిమీద ఒకరికి అనురాగం లేకుండా, ఆ అపనమ్మకముతో, అవిశ్వాసంతో మనస్ఫూర్తిగా లేని, భయంతోకూడిన దొంగ దాంపత్యం సాగిస్తారు కాని, ఇల్లూ వాకిలి సంసారం, ఇది 'నాది' అనే భావంతో, ఒక శాశ్వతమైన ఆశతో బాగుచేసుకొంటారా?

శారద—ఇది విచారించవలసిన సంగతిదా!

వెంకట—అయితే ఇంకొక్కసంగతికూడా విచారించండి. మూడేసి రోజులకల్లా భార్యాభర్తలు మారుతుంటే మరి దీనికీ వ్యభిచారానికీ ఉన్న భేద మేమిటి? ఇదొక లైసెన్సుడు (licensed) వ్యభిచార మన్న మాటేనా?

శారద—భార్యకీ భర్తకీ సరిపడనప్పుడు భార్య తన జీవితం వేరే గడుపుకోనరాదా? తన కిష్టము లేకన్నా మనస్సు చంపుకొని భర్తయింట్లో పడియుండవలసిందేనా?

వెంకట—వేరే జీవితం గడుపుకొనేశక్తి ఎలాంటివాళ్ళకమ్మా! మనదేశంలో జమీందారులున్నారు. వాళ్ళలో స్త్రీ విడాకులిస్తే తన కాలక్షేపానికి తగిన ఆస్తి వుంటుంది. కూలివాళ్ళున్నారు. వాళ్ళలో ఆడది విడాకులిస్తే కూలిచేసికొని తన పొట్టపోషించుకోగలదు. ఎందుకూ పొందని మధ్యతరగతి వాళ్లం మనలాంటివాళ్ళ మాటేమిటి?

శారద—స్త్రీలు చదువుకొని ఉద్యోగాలు చేస్తారు. స్త్రీలలో డాక్టర్లూ లాయర్లూ ఎంతమంది లేరు?

వెంకట—మీరు చెన్నపట్నంలో ఉన్నారుగనుక అందరూ చదువుకొనే స్త్రీలే కనబడతారు. ఇండియా అంతటిలోనూ ఎక్కువ విద్య ఉన్నాదనిపించుకొంటూన్న మన ప్రెసిడెన్సీలోనే చదువుకొన్న స్త్రీలు, అంటే తమస్వంత భాషల్లో అక్షరజ్ఞానం ఉన్నవాళ్ళు నూటికి ముగ్గురు. మరివీళ్ళు ఏం ఉద్యోగాలు చేస్తారు? విడాకులచట్టం వచ్చిందని హడావిడిగా మొగుణ్ని వదిలేయడమే మిగులుతుంది కాని మరునాటినుండి చిప్పాదొప్పా చేతి కొస్తుందే.

శారద—నేను చెప్పేది ప్రతి స్త్రీ అట్లా చేయవలెనని కాదు. అట్లా చదువుకొని తనజీవితం తాను నడుపుకోగలిగిన స్త్రీకి భర్తతో జగడం వస్తే విడాకు లిచ్చే హక్కు ఎందుకు ఉండరాదు?

వెంకట—అలా చదువుకొన్న స్త్రీ లయితే, చక్కా స్పెషల్ మారేజిఆక్టు ప్రకారం పెండ్లిచేసుకొంటే దానిలో విడాకులకి హక్కు ఉంటుంది. అంతేగాని, ఒకరికి తెద్దునా అందరికీ తెద్దునా అన్నట్లు హిందూ లా అంతా మార్చేసి తోక తెగిన నక్కలాగు అందరి తోకలూ కోయించనక్కరలేదు.

శారద—అందుకనే నేను స్పెషల్ మారేజిఆక్టు ప్రకారం పెండ్లి చేసికొంటిని.

వెంకట—క్షేమయినపని చేశారు. అయితే మీకు వివాహమయింది టండీ! మీ భర్త ఎవరు?

శారద—మిష్టర్ వేణుగోపాలరావు.

వెంకట—ఎవరబ్బాయి?

శారద—అతని తండ్రిపేరు నాకు తెలియదు. ఎక్కడనో మ్యునిసిపల్ ఛైయిర్మను అని చెప్పినాడు.

వెంకట—[రామశాస్త్రితో] మీ శంకరయ్యకొడుకే కాబోలు [శారదతో] బాగా టెన్నిస్ ఆడుతాడుకామా? అతని తండ్రికి లాటరీలో డబ్బు వచ్చిందికాదూ?

శారద—మంచి టెన్నిస్ ప్లేయరు. లాటరీసంగతికూడా ఒకసారి చెప్పినాడు.

వెంకట—భార్య కాపరానికి తగిఉండగా భర్త తగిన కారణం చెప్పకుండా ఇంకొకర్తెను పెళ్ళాడడం తప్పని మీ రన్నారుకారూ?

శారద—అవును. అట్లాచేస్తే మొదటిభార్యకు ఆస్తిలో సగము ఇచ్చివేసేదానికి లా మార్చవలె.

వెంకట—[రత్నాన్ని చూపి] ఆ అమ్మాయి కాపరానికి తగి వుందా?

శారద—[రత్నాన్ని చూచి] బై ఆల్ మీన్సు (By all means)

వెంకట—సంసారికి తగిన చక్కదనం ఉందంటారా? తెలుగు బాగా చదువుకొంది. కొద్దిగా ఇంగ్లీషుకూడా నేర్చుకొంది. పాపం! ఈపిల్లని విడిచిపెట్టేసి ఈమెభర్త ఇంకొకరిని పెళ్ళాడేడండీ!

శారద—ఎవ డండీ ఆఫూల్? ఏమి కారణం?

వెంకట—ఏమీలేదు. ఈ పిల్లకి బాగా ఇంగ్లీషు రాదట. బియ్యే చదవలేదట. తనదర్జాకి తగింది కాదట. మరీ, ఈపిల్లని ఏం చెయ్యమంటారని మీ సలహా అడుగుతున్నాను.

శారద—ఇంకొక మంచివానిని చూసి పెండ్లిచేయండి మీ!

వెంకట—[నవ్వుతూ] వెనకటికి మా పెద్దమ్మాయి తరుచుగా ఒక పద్యం చదివేది. మీరు విని ఉండరు.

"బడలిక నస్సురుస్సు రని వచ్చిన భర్తకు తెల్పకమ్మ నీ యిడుములు, పాదశుద్ధికొర కిచ్చి జలంబును, తాళవృంతమున్

వడి కరమందు బూని నునుపాన్పున జేరిచి సేదదేర్చి నీ
వడుగుల నొత్తి వాని సుఖ మందగజేయుము మానినీమణీ"] అని

లుకెట్ దట్ పిక్చర్ ఎండ్ దిస్ (Look at that picture and this) అన్నట్లు, భర్తతో అగ్నిలో బడి సహగమనం చేసే రోజులవీ! భర్తకు విడాకు లిచ్చి మళ్ళా పెళ్ళిచేసుకొనే రోజు లివీ! బాగానేవుంది! మరి అలాగ అన్యాయం చేసిన భర్తకేమిటి శిక్ష?

శారద—అతని ఆస్తిలో సగం భార్య కిచ్చివేసేదానికి లా మార్చవలె.

వెంకట—మరిప్పు డలాటి లా లేదు. ఈపిల్ల ఇంకొకరిని పెళ్లాడడానికీ లా ఒప్పుకోదు. రేపు మళ్ళా అతడు వచ్చి నా పెళ్లాన్ని పంపించండీ అంటే వీళ్ళు పంపవలసినదేనా? ఆ సవతితో ఈ విడ అక్కడ బాధలుపడుతూ ఉండవలసిందేనా? ఎవరో మీ బోటి చదువుకొన్న సవతయితే బాగా ఆదరిస్తుందికాని...

శారద-నావంటి దయితేనా? ఈ అన్యాయం చేసినదానికి వెంటనే విడాకు లిచ్చేసి. నీ మొదటిభార్యవద్ద పొమ్మని చెప్పవలసిందిదా!

సీతమ్మ—నీ కడుపు చల్లగా నీ యిల్లు వెయ్యిళ్ళు మొదలై—

వెంకట—మీరు స్త్రీ స్వాతంత్ర్యమంకోసం, నడుము కట్టుకొని, స్త్రీలని మహోన్నతదశకి తేవాలని ప్రయత్నిస్తున్నారు కదా! అతనిభార్య గొంతుకోసి, ఆమెను విడిచిపెట్టించేసి, మీ రతనిని పెళ్ళాడడం ధర్మంగాఉందా? చెప్పవి శ్రీరంగనీతులా?

- శారద—అదేమండీ! వేణుకి పెండ్లి కాలేదే!

వెంకట—పెళ్ళి కాలేదని చెప్పాడా!

శారద—స్పెషల్ మారేజీ ఆక్టు ప్రకారం ఒక భార్య ఉండగా పెండ్లిచేసికొనకూడదే! మారేజీ రిజిస్టరయినప్పుడు బాండులో సంతక మెట్లా పెట్టినాడు?

వెంకట—అదేమోగాని అ అమ్మాయినే. ముందుగా అతడు పెండ్లి చేసికొని, ఇంగ్లీషురాదని విడిచిపెట్టేసి మిమ్మలిని మళ్లా చేసికొన్నాడు.

శారద—ఏమండీ! అంతా తమాషా చూపిస్తున్నారే, సినిమా మాదిరి!

వెంకట—[కామశాస్త్రిని, సీతమ్మను చూపి] అరుగో! ఆపిల్ల తల్లీ, తండ్రిని—

శారద—వాస్తవందానా! వేణు నన్ను నిండా మోసం చేసినాడే! (నిట్టూర్పుతో)

వెంకట—ఇంకా సందేహ మేమిటి? మధ్యకాలంలో లాటరీలో డబ్బు రావడంవల్ల వాళ్ళు గొప్పవాళ్లయారు. బీదవాళ్ళపిల్ల పని కొచ్చిందికాదు.

శారద—పాపం! ఇట్లారా అమ్మణ్ణీ! [రత్నం జంకుతూ వెళుతుంది]

వెంకట—మీ రింత తెలివయినవారుకదా! అతనిమాయల్లో ఎలా పడ్డారా అని నాకు ఆశ్చర్యం.

శారద—నా కదేమీ తెలియదండీ! మాఫాదర్ ని మోసం చేసినాడు. నాకు మారేజి విడచి కంటిన్యూస్ వర్కు చేసే దానికిదా సంకల్పం. ఫాదర్ ఓల్డుఏజిలో నన్ను చూసే దెవరూ లేరు అని బలవంతం పెట్టి—వేణు నాకు టెన్నిస్ పార్ట్నర్—ఒకనాడు టీకి ఇన్వైటు చేస్తే ఛేన్సు కలిగి మారేజి అరేంజి చేసినారు. ఆయన మనస్సు కష్టంచేసే దాని కిష్టంలేక వప్పుకొంటిని. అంతదా! నేను అతనిని హాస్బెండుగా ట్రీట్ చేయనేలేదు—చాలా మోసం చేసినాడే! అబ్బా! ఎంత మోసం చేసినాడు! [సీతమ్మతో] ఈ అమ్మాయి కాపురంచేసినదా.

సీతమ్మ—లేదమ్మా! పెద్దపిల్ల కాకముందునుంచీ మళ్లా పెళ్లి చేసుకుంటామని పాటలు పాడడం ఆరంభించారు. ఏదో కొన్నాళ్ళు కాపురంచేసి పిల్లా పిచికా కలిగాక, ఇలాంటి ఉపద్రవం వస్తే ఆపిల్లలని చూసుకొనేనా బ్రతుకును.

శారద—అయితే అంత మోసగాడికోసం, ఎందు కీమె కంత తంటాలు? మంచివానిని ఇంకొకరిని చూచి పెండ్లి చేయుండి మీరు! సూర్యంగారు ఉన్నారే! చాలా చదువుకున్నారు- మంచిమనిషి—

సీతమ్మ—మా ప్రకాశాన్నే-

శారద—ప్రకాశం ఎవరు?

ప్రకా—నన్నే మా వాళ్ళు ప్రకాశం అంటారు. అసలు నా పేరు సూర్యప్రకాశం—జైలులో అంతా 'సూర్యం' అనే పిలిచేవారు. ఈ పిల్ల...మా చెల్లెలేనండి -

శారదా—ఏ మిది? అంతా నాటకంమాదిరి ఉన్నదే!

కామ—మా అబ్బాయేనమ్మా! నా ప్రథమ కళత్రం కుమారుడు.

శారద—[ప్రకాశంతో] మీ రెప్పుడూ చెప్ప లేదేమి? వేణు ఇట్లా మీచెల్లెలిని పెండ్లిచేసికొన్నాడని -

ప్రకా—అసలు నేను చెన్నపట్నం రావడం, ఎలాగయినా వేణుమనస్సు మళ్లించి ఈ పిల్ల కాపరం నిలబెడదామనే! కాని నేను వచ్చేసరికే మీ వివాహం అయిపోయింది. ఈ సంగతి మీతో చెబితే అనవసరంగా మీకు మనస్పర్థలూ, మాకు ఉపయోగం లేకపోడం అని చెప్ప లేదు. క్రమంగా మీ సహృదయం గ్రహించి, ఇక్కడికి తీసుకువచ్చి పరిస్థితులు తెలియజేస్తే మీ మనస్సే కరుగుతుందని ఆశించాను.

శారద—మీ రంతా పెద్ద ప్లాను (Plan) వేసినారే! ఇందుకు దానా నన్నిక్కడకు తీసుకొనివచ్చినది? ఇక్కడ చర్చకు కూడా ఇంకా ఎవరూ రాలేదేమి అని సందేహం ఉండింది నాకు. మునసబుగారు పెద్దలాయరుపని. చేసినారు. సూర్యంగారు కూడా ఇంతకాలం చెప్ప కుండా డిసీవు చేసినారే! అబ్బా! నే నెంత ఫూల్నైపోయినాను-!

ప్రకా—క్షమించాలి. మీ మనస్సులో ఆ అభిప్రాయం ఎన్నటికీ ఉండకూడదు. ఏలాగయినా మీ మనస్సు కరిగిద్దామనే ఉద్దేశమే కాని మిమ్మల్ని వంచిద్దామనే ఉద్దేశం ఎన్నటికీ లేదు.

శారద—మీ కాంగ్రెసువాళ్ళు అసత్య మాడరుకదా!

ప్రకా—దీనిలోమాత్రం అసత్య మేముందీ? మీరు అడిగితే ఇదివరకే చెప్పిఉందును. నా అంతట నేను చెప్పడానికి సంకోచించాను,

కాంగ్రెసు వాళ్ళలోకూడా రెండు తెగల వా ళ్ళున్నారు. గాంధీగారి
లాగు బట్టబయలుగా సత్ప్రవర్తన కలవారు కొందరూ, సత్యానికి
భంగం లేకుండా రహస్యపు ఏర్పాట్లు అంటే డిప్లొమసీ (Diplomacy)
ఉండాలనేవారు కొందరూను.

శారద...మీరా రా తెగవారా! సరిద! ఇక్కడికి వచ్చిందిదా
మేలయింది. వేణు నిండా రోగ్ అని తెలిసింది. [రత్నంతో] నీ కా
రోగ్, వేణు మోసగాడు కావలెనా? అమ్మా! నీకు ఇష్టమేనా?

సీతమ్మ—అగ్నిసాక్షిగా పెళ్లిచేసికొన్నాక ఎలాంటివా డయినా
తప్పదు.

శారద—నాతో పట్నం రా అమ్మా! నీ భర్త స[illegible]గిస్తాను.
నాకు డైవర్సు చేసే అధికారం ఉంది.

సీతమ్మ—కోపం వద్దమ్మా! మీ వంటి విద్యావంతుల దగ్గ
రుంటే మా పిల్లకు వచ్చిన భయ మేమీ లేదు. మీ తోబాటు మా
పిల్లనికూడా ఏలుకొని, దానికడుపున ఓ గాయ కాయాలనే మా
అందరి కోరికాను.

వెంకట—మీరు వాగ్దానం ఇచ్చినప్పటికీ మీరు విడాకు లిచ్చే
యాలనేకోరిక మాలో ఎవరికీ లేదు. ఈ పిల్లనుకూడా భర్తతో కలప
వలసిందనే మా అందరి కోరికాను.

శారద—నే నా రోగ్‌తో వుండేది లేదండీ! మీకు సందేహం
ఉంటే మీ రందరూకూడా నాతో పట్నం రాండి.

కామ—మేముకూడా ఎందు కమ్మా! రైలు ఖర్చులదండుగ!
తల్లీ పిల్లా వస్తారు.

వెంకట—వెళ్ళనయ్యా పిచ్చిబాగ్రమ్మాడా! దావా ఖర్చులు
మిగిలాయికావూ!

శారద—ఇంకా టైము వుందిగదా! సూర్యంగారూ మీరు
పోయి బండ్లు తెప్పించండి. వీరిని రామస్వామి మొదలిచాట్రిలో
దింపి, నేను ముందుగా పోయి వేణు సంగతి పట్టిస్తా!

వెంకట—అమ్మా! నేను వెళతానూ!

శారద—తమతో చర్చచేసినది చాలా మేలుయింది. కొన్ని విచారించవలసిన సంగతులు చెప్పినారు. వాస్తవంగా విడాకులచట్టం ఈ సమయంలో మనదేశానికి సరిపడదేమో అని నాకుకూడా సందేహం కలుగుతూంది.

వెంకట—అమ్మా! నే నొకమాట చెప్తాను. కోపం లేదుకద! ఇవి, మనకి స్వతహాగా పుట్టిన బుద్ధులుకావు ఏదో సంపర్కదోషం వల్ల అందరికీ భావదాస్యం కలిగింది. అది మీలో బాగా పనిచేసి విడాకులదాకా తెచ్చింది. మీభర్త ఈ పిల్లని విడిచి ఇంగ్లీషు చదువు కొన్న మిమ్మలిని చేసుకోడంలో పాశ్చాత్య భావాలకి పూర్తిగా దాసు డయాడు. స్వతంత్రాలోచన లేకుండా చిన్నపిల్లకి పెళ్లిచేసి కొడుకు నింట్లోంచి తగిలేసి శిష్టాచారాలకి దాసు డయాడు మా శామశాస్త్రి. ఇక మాబోటివాళ్లం త్రికరణశుద్ధిగా ఎల్లప్పుడూ దాసులమే! ఏమయితేనేమి ? ఇంగ్లీషులో ఉన్నతవిద్య నభ్యసించినందుకు మీరు ఆదర్శమయిన ప్రవర్తన చూపించారు. మహాత్యాగం చేశారు. మీ సాంఘికసేవ సరియైన మార్గంలో నడవాలనే నే నెన్నటికీ కోరుతూ ఉంటాను. చూశారా మన మేవిధంగా అభివృద్ధిలోకి వచ్చినా ప్రపంచ మంతటికీ ఆదర్శప్రాయమయిన భారతీయ స్త్రీత్వం మాత్రం నశించకుండా కాపాడాలి. మరి వెళతాను !

[శారద నమస్కరిస్తుంది—వెంకటరావు వెళతాడు]

ప్రకా—బళ్లు వచ్చేశాయి- వ్యవధి లేదు రండి.

శారద—రండమ్మా ! మీ రంతా రండి—రెండురోజుల్లో అల్లుణ్ణి తీసుకొని తిరిగివస్తారు.

సీతమ్మ—అయ్యో కట్టుకొన్న గుడ్డతో ఎలాగ? మరో మారు గుడ్డయినా లేకుండా !

ప్రకా—బళ్లు మన యింటిదగ్గరనుండే వెళతాయి. అక్కడ తీసికోవచ్చును, టయి ముంటుంది—పదండి.

[అంతా వెళతారు]



ఓం!

బ్రహ్మకృపాహి కేవలమ్.

# విడాకులా?

## పదో రంగము

సమయం సాయంత్రం 6 గంటలు.

[చెన్నపట్నంలో ఒకవీధి - రాయలసీమక్షామ నివారకదళంవారు పాడుతూ చందాలు వసూలుచేస్తూ. తిరుగుతారు]

"రంగా రంగా" వరస

1 రాయలు పరిపాలించిన దేశము
రామరాజ్యమండీ! అది
క్షామనిలయమై శ్మశానమయినది
క్షామనివారణ చేయండీ ॥రాయలు॥

2 అష్టదిగ్గజము లలంకరించిన
ఆంధ్రభోజు రాజ్యములో-ని
రక్షరాస్యులగు ప్రజల జీవముల
రక్షణకైనను తోడ్పడుడీ! ॥రాయలు॥

3 హంపీశిల్ప క్షేత్రగర్భమున
ఆర్తనాదములు వినుడీ! నా
గార్జున పర్వత శిల్పసంపదలు
ఆంధ్రులకే కనరావండీ! ॥రాయలు॥

4 కత్తిని కలమును సన్మానించిన
ప్రత్తిపంటగల సీమన్
వృత్తిలేక రాళ్లు కొట్టుకొని జీ
వించెడి జనులను చూడండీ! ॥రాయలు॥

5 పొట్టకు పట్టెడు కూడు లేకుండ
కట్ట గుడ్డ లేకుండా
మెట్టుకు నిలువగ నీడ లేకుండ
గిట్టెడువారిని చూడండీ! ॥రాయలు॥
6 బాలురు వృద్ధులు స్త్రీలును పురుషులు
పాల నోసంగెడి పశువుల్
వేలకొలది పోవగ మిగిలిన జీ
వాలనైన నిలుపండీ! ॥రాయలు॥

---

ఓం!
బ్రహ్మకృపాహి కేవలమ్.

# వి డా కు లా?



## పదకొండో రంగము



సమయం ఉదయం 9 గంటలు.

[రామారావింట్లో మేడమీద శారదగది పేము కుర్చీలో కూర్చొని ఆలోచనలోపడి పాడుకుంటూ ఉండగా]

గీతం

ఎద మెత్తనౌటకై సొదగుందరా, అంత
మదిగల అహమ్మెల్ల వదలిపోవునురా॥
వల పెరుంగక బ్రతికి కలికి మూరిసేగంటు
వలచి విఫలమ్మొంది విలపింప మేల్గురా॥
చెలివలపులేని నీ కలిమి కాల్పనె వినుము
వలపు తీగనె జీవ ఫలము కాయునురా॥

ప్రేమకంటే ఎక్కువేముందిరా, ఎల్ల
కామ్యపదవులకన్న ప్రేమ ఎక్కువరా॥
ప్రేమించు సుఖముకై, ప్రేమించు ముక్తికై
ప్రేమించు ప్రేమకై ఏ మింక వలయురా॥

[బసవరాజు అప్పారావు]

[తండ్రి దివాలా తీసినట్లుగా ఉత్తరం వస్తుంది. అదిచూసి వేణు దుఃఖపడుతూండగా శంకరరావు, పద్మనాభం ప్రవేశిస్తారు. శంకర రావు సాధారణమయిన పంచ, కోటు, కండువాతో వుంటాడు - మాసిన గెడ్డం]

వేణు—[లేచి] ఇప్పుడు మెయిలులోనే వచ్చారా? ఇప్పుడే వచ్చింది మీ ఉత్తరం!

శంక—[పద్మనాభంతో] మీరు కింద నిలబడి మీది కెవరూ రాకుండా చూడండి. నే నిక్కడున్నానని పిట్టమనిషికైనా తెలియనీ కూడదు. మీరుకూడా ముసుగో ఏదో వేసుకొని కూర్చోండి. [పద్మ- వెళతాడు]

[వేణు-శంకర-కుర్చీలమీద కూర్చుంటారు శంక-చుట్టకాలుస్తూ]

వేణు—ఇంత లాస్ ఎట్లా వచ్చిందీ?

శంక—ఎట్లా వచ్చిందేమి టబ్బాయి! బాకీ దార్లంతా ఒక్క మాటు మీద పడిపోతే ఏ వర్తకు డాగగలడు? ఇదంతా కాంగ్రెసు వాళ్ళుచేసినపనే! వాళ్ళే బాకీదార్లందరినీ పిలిపించి మీద నెక్కించారు.

వేణు—మరి మిల్లుకూడా తగలబడి పోయిందని రాశారు.

శంక—[చుట్టుపక్కల చూసి] అది కొంత గమ్మత్తు. ఇక్క డెవరూ లేరుగద!

వేణు—లేరు.

శంక—మరి నీ భార్య ఏదీ?

వేణు—ఏవూరో లెక్చరుకి వెళ్ళింది.

శంక—ఒక్కత్తే?

వేణు—ఒక్కర్తే! దాని కేం భయం. పదిమంది మొగాళ్లపెట్టు అది. మిల్లుమాట చెప్పండి ముందు.

శంక—వేయి బేళ్ళ నూలుకి ఆర్డరిచ్చి దానికోసం కొంత క్యాష్ (cash) ఉంచాము. ఈ బాకీదార్ల హడావుడిచూసి, ఆ క్యాష్ నిలువ చేసి, ఆర్డరు కాన్సిలు (cancel) చేశాము. ఇంకా సరుకు స్టీమరు ఎక్కలేదు లే! మరీ విలువైన బట్టలన్నీ మేనేజరు పరంగా రెండు మూడు రోజుల్లో చలామణీ చేయించేశాను. మిల్లులోఉన్న చెత్త, చెదారం, తుక్కూ అంతా స్టోరుగదిలో నిలవచేసి నిప్పు అంటించాము. ఇంకేముంది! బట్టలన్నాకూ, స్టోరుగదీ కాలిపోయి లక్షరూపాయల నష్టం వచ్చిందని రూమరు పుట్టిపోయింది. అగ్ని ప్రమాదపు భీమా ఉంది కాదూ! వాళ్ళదగ్గర వసూలయిపోతుంది. రహస్యం సుమా! నీ భార్యకు కూడా చెప్పకుండదు.

వేణు—దాని కీ గొడవ లేమీ అక్కర్లేదు. దాని కెంతసేపూ లెక్చర్లూ ప్రయాణాలతో సరిపోతుంది.

శంక—మీా ఇద్దరికీ అన్యోన్యంగా, అనురాగంగా ఉందా ?

వేణు—ఏమో, నా కేమీ నచ్చలేదు. అదిచెప్పినమాట నేను వినవలసిందేకాని, నే చెప్పినమాట అది వినదు.

శంక—ఇంతేనటోయ్ ! అయితే ఇరవై రోజులకే మొగం మొత్తిపోయిందీ? ఊళ్లో ఉన్నప్పుడేనా, దగ్గరకు రావడం, మాటా మంతీ—

వేణు—ఏమిటో పోనిద్దురూ! ఇప్పటి కింకా ఏమ్మీా లేదు.

శంక—అయితే దీనినికూడా వదిలేస్తా వేమిటి ? కొంపతీసి—

వేణు—వదిలేస్తే భరణానికి దావా పడేస్తుందేమో! పెద్ద హోదామనిషి—

శంక—దావాపడేస్తే మనదగ్గరనుంచి దాని కేంవస్తుంది నెత్తికి చేతులు? నేను ఐ. సీ. పెట్టేస్తున్నాను. ఒకసారి నీతో ఆలోచించి మరీ చేదామని వచ్చాను. ఈ రావడం యుకాయుకీ కారులో కొంత

దూరం వచ్చి అక్కడ రైలెక్కాను. కొందరు బాకీలకి దావాచేసి అరస్టువారంట్లు తెప్పించారు.

వేణు—కొంప ములిగిందన్నమాట! బాకీ లెంత ఉన్నాయి ?

శంక—లక్షకి పైగా ఉంటాయి. ఆ భీమా కంపెనీవా ళ్ళేమయినా దయదలచి ఇస్తే వాళ్లు పంచుకు తింటారు.

వేణు—లెక్కలనిబట్టి సరుకు నిలవ, కేష్ నిలవ తెలియదూ!

శంక—లెక్క లెక్కడున్నాయ్? అవికూడా స్టోరుగదిలో కాలి పోతేనే!

వేణు-ఈ మ్యునిసిపల్ చెయిర్మను పనినుంచే లాస్ వచ్చేసింది.

శంక—ఏం చెయ్యమన్నావు? కొన్ని గ్రహాలు పట్టుకొని వదిలేయి:కావు.

వేణు—నలుగురిలో ఎంత తలవంపులు!

శంక—తలవంపుల కేముందిరా! జరిగినన్నాళ్లూ దర్జాగా జరిగి పోయింది. హాంసయి ఆరునెలలు బతికితే చా లన్నాడు. మనకి దివాలా ఏమిటి, డబ్బిచ్చుకొన్నవాళ్ళకి దివాలాకాని? ఆ మాత్రం భుక్తికి జాగ్రత్త పడకుండా వ్యవహరించలేదు. మనలో ఇట్లాంటివి ఎక్కడోగాని, కొన్నిఊళ్ళలో కోమట్లు పిల్లనడగడానికి వెళితే ఎన్ని దివాలాలుతీశావని అడుగుతారట. ఎన్నిదివాలాలు తీస్తే అన్నిలక్షలు నిలవవున్నట్లు... అయితే నీ భార్య ఎప్పుడు వస్తుంది?

వేణు—ఇప్పుడు మెయిలులో రావలసిందే! [క్రిందనుండి గోల వినబడుతుంది. వేణు మేడమీదనుంచి క్రిందికి చూచి "వదిలే యండి; వాళ్ళని అడ్డుపెట్టకండి" అని కేక వేస్తాడు]

శంక—ఎవ రది?

వేణు—ఆవిడగారే దయచేసింది. మీ మేనేజరు తెలియక అడ్డగించాడు.

శంక—వా ళ్లంటున్నావు? ఇంకా ఎవరేనా ఉన్నారా ఏమిటి?

వేణు—ఉన్నాడు లెండి, ఒక హిందీమాస్టరు. ఆవిడకీ అతనికీ స్నేహం. ఇద్దరికీ ఏవో చర్చలూ తర్కవాదాలున్నా.

[శారద ప్రకాశం ప్రవేశిస్తారు. శంకరరావు వారిద్దరినీ పరకా యించి చూస్తాడు ప్రకాశం, శంకరరావుని పరకాయిస్తాడు.]

శార—ఎవరది? మాకు మీదికి రాకూడదని అడ్డు చెపు తున్నాడు?

వేణు—మా ఫాదరు వచ్చారు. మేము వేరే సంగతులు మాట్లాడుకొంటున్నాం! అందుచేత ఎవరినీ మీదికి రానీవద్దని మనిషిని కాపుంచారు.

శార—మీ ఫాదర్ మ్యునిసిపల్ ఛైయిర్మను ఈయనేనా? (ప్రకాశంతో)మీరు కారులో పోయి వారిని తీసుకొనిరండి. [ప్రకాశం వెళతాడు; శారద సూట్ కేసు, పుస్తకాలు టేబిలుమీద పెట్టి] బాత్ రూమ్ క్లీన్‌గా ఉన్నదా?

వేణు—అదేమో! నేను చూడలేదు. [శారద కోపంగా చూసి వెళుతుంది].

శంక—ఏమి టంటుంది?

వేణు—స్నానాలగది శుభ్రంగా ఉందా అని అడుగుతూంది.

శంక—నువ్వు బంట్రోతు వనుకొంటా ఏమిటి చెప్మా! నువ్వన్నట్లే నోయ్ దాఖలాగానే ఉంది. మరి ఇలాంటిదాన్ని చేసుకొన్నావేమీ?

వేణు—బుద్ధి గడ్డి తిని.

శంక—ఆ కుర్రాడు, కామశాస్త్రికొడుకు మీ బావమరదికి మల్లే ఉన్నాడు.

వేణు—అబ్బే! ఇత నిక్కడ హిందీమాస్టరు; అసలతను జైలులో పడ్డాడని కూడా విన్నాను.

శార—[లోపలినుండి] వేణూ! మీ ఫాదర్‌తో నేను కొంత ప్రయివేటుగా మాట్లాడవలె! నేను పిలిచేవరకూ నీవు క్రిందికి పో!

శంక—నిన్ను కిందికి పొమ్మంటూందా?

వేణు—మీతో ఏదో ప్రయివేటుగా మాట్లాడుతుందిట.

శంక—నాతోనే! ఇంగ్లీషు మాట్లాడవద్దని చెప్పవూ! అయితే నిన్ను ఏమండీ, మీరు, అనికూడా పిలవడం లేదా ఏమిటి?

వేణు—ఆ పద్ధతి మేము మానుకొన్నాం! ముద్దుగా వేణూ అని పిలుస్తుంది.

శంక—అయితే నీదగ్గర భయం భక్తీ లేదన్నమాట!

వేణు—ఇప్పుడారోజులు పోయినాయి! ఇప్పుడంతా ఆడదాని కంటె మగవాడి ఎక్కువేమిటి? ఈవూరి కావూరెంతో ఆవూరుకీ వూరూ అంతే దూరమని? ఇప్పుడు స్త్రీల మువ్మెంటు అని ఒకటి వచ్చింది.

శంక—అయితే మగాళ్లుచేసేపనులన్నీ నీళ్ళుచేస్తారన్నమాట.

వేణు—ఆహా! ఇకముందు ఆడవాళ్ళు మొగవాళ్లమీద అధికారం చలాయించడం; ఉద్యోగాలు చేయడం, పోలీసుపనులు-మంత్రిపనులూ అన్నీవీళ్ళే! మగాళ్లకి ఇంట్లో వంటా పెంటా, పిల్లలకి సంరక్షణా, అంట్లుతోమటం, బట్టలుతకటం, దాసీపనీ—ఇత్యాదులు.

శంక—పోనీ పిల్లలని కనడమేనా ఆడవాళ్ళు చేస్తారా? అదీ మగాళ్ళేనా?

వేణు—వస్తూంది ఊరుకోండి [సంజ్ఞ చేస్తాడు]

[శారద ప్రవేశిస్తుంది. శంకరరావుకు ఎదురుగా కుర్చీమీద కూర్చుంటుంది, శంకరరావు దుస్తులు, మీనం సర్దుకొని, ఠీవిగా కూర్చుని వింతగా చూస్తాడు.]

వేణు—నేను క్రిందికి వెళతానుగాని-మా ఫాదరుకి ఇంగ్లీషు రాదు. తెలుగులోనే మాట్లాడాలి. [వెళతాడు]

శార—ఏమండీ! వేణుకి మీరు మొదట పెండ్లిచేసినారా?

శంక—అవును? మేనరికంచేశాము. ఆపిల్లని విడిచిపెట్టేశామే!

శార—ఏమికారణంచేత విడిచిపెట్టినారు?

శంక—ఏమో! చదువు సంధ్య లేదని మావాడికి నచ్చలేదన్నాడు.

శార—చదువలేకపోతే విడిచిపెట్టేదేనా! వేణూ! వేణూ!

[వేణు తొందరగా వచ్చి చేతులు కట్టుకొని వెళాకోళంగా నిలబడతాడు.]

శార—నీవు నీ మేనమామ కొమార్తెను పెండ్లిచేసికొంటివి కాదూ!

వేణు—అవును! ఇప్పుడా సంగతెందుకు?

శార—స్పెషల్ మారేజి ఆక్టుప్రకారం మారేజిచేసుకొన్నప్పుడు నీవు ఆక్టుకు బైండయినట్లుగా రిజస్ట్రారువద్ద సంతకం చేయలేదూ?

వేణు—అవును. చేశానే!

శార—దానిలో ఒకభార్య ఉండగా తిరిగీ మారేజి చేసుకోకూడదని కండిషన్ లేదూ?

వేణు—ఆ భార్యని విడిచిపెట్టేశాక అది లేనట్లే కాదూ!

శార—ఉండగా అనగా బ్రతికి ఉండగా అని అర్థం.

వేణు—అదేమో! నాకు తెలియ లేదయితే! నే నిట్లా అర్థం చేసుకున్నాను.

శార—తెలియలేదా! నన్ను అబద్ధం చెప్పి మోసం చేసినదానికి నిన్ను ఎందుకు ప్రాసిక్యూట్ చేయకూడదు?

శంక—ఇదేమిటోయి! [కంగారు పడి, శారదతో] ఏదో తెలియక చేశాడు. ఎలాగో సర్దుకోవాలి మరి!

శార—తెలియక చేసినాడా? నా లైఫ్ అంతా పాడుచేసినాడే!

శంక—ఏదో పొరపాటు జరిగిపోయింది. చేసుకొన్నందుకు వాడేం సుఖపడిపోతున్నాడు.

శార—నీ భార్య నెందుకు విడిచిపెట్టినావు?

వేణు—చదువు సంధ్యా లేదు. ఓల్డు ఫేషన్డుగా ఉంటుందని.

శార—భార్యఅంటే చినిగిపోయిన చెప్పు అనుకొంటివా విడిచిపెట్టేదానికి? రసం పీల్చి పిప్పి పారవేసే చెరుకుతుంటను అనుకుంటివా? [illegible] తిని పారవేస్తాకే, ఆ టెంకదీ; [illegible] అనుకొంటివా? నీ భార్యను తిరిగి తెచ్చుకుంటావా?

వేణు—నిన్ను మారేజి చేసుకొన్నాక ఆభార్య నెందుకు తెచ్చు కుంటాను? ఇద్దరినీ భరించగలనా? అందుచేతనూ బిజినెస్ ఫెయి లయాక—

శార—ఐ డోన్టు కేర్ ఫర్ యూ (I don't care for you) నాకు హజ్బెండై ఉండేదానికి నీవు డిజర్వ్ కావు. ఇంకా నన్నూ మా ఫాదర్నీ మోసం చేసేదానికి చూస్తున్నావా?

వేణు—నేనేం మోసంచేశాను? నీ టూర్సుకీ, ప్రోగ్రాములకీ కావలసినంత డబ్బూ పెట్టి, నిన్ను ఇంత ప్రేమించి, నీ యిష్టం వచ్చి నట్లూ ఊళ్లంట తిరుగుతూంటే ఊరుకొని సహించినందుకు పైగా మోసంచేశా నంటావా?

శార—నాకు ప్రోపర్టీ లేదనుకొంటివా? ఈ హౌస్ నాఫాదర్ నా కొరకు కొన్నదిదా; ఫాదర్ లైఫ్ ఇన్సూర్యెన్సు అమౌంటు టెన్ థౌజండు నాపేరదా అస్సైన్ (assign) చేసినారు. ఇంగా పెన్షన్ కూడా కమ్యూట్ చేసి, ఇస్తానన్నారు. నేను నీపై ఎంటైరుగా డిపెండయి ఉంటి ననుకుంటివా? నేను ఇంతకాలము నీవైఫ్ అనిపించుకొని నాపేరు లెండ్ (Lend) చేసినందుకు నీవు గ్రేట్ఫుల్గా ఉండవలసింది. లైఫ్లో నాకు తగిన పార్ట్నరుగా ఉండే దానికి నీవు డిజర్వ్ కాక పోయినా నీతో లివ్ (live) చేసి ఉందును! నీవు ఫస్టువైఫ్ సంగతి దాచిపెట్టి నన్ను డిసీవు చేసినందుకుదా నిన్ను డైవర్సు చేస్తున్నాను.

శంక—అయితే అమ్మాయీ! ఇంత ఐశ్వర్యమున్నాక సుఖంగా ఉండకూడదూ! వదిలేసిన పిల్ల దానిజోలి ఎందుకూ? మాదగ్గిర ఉన్న న్నాళ్ళు మేం పెట్టాం! భార్యా భర్తల డబ్బుకి నాదీ నీదీ అనే భేద మేమిటి? ఇద్దరూ కలబోసుకోవాలిగాని.

శార—ప్రిన్సిపుల్సు (principles) లేకుండా రోగరీ ప్లేచేస్తే ఎట్లా ఉండేదండీ? స్పెషల్ మారేజి ఆక్టులో నాకు డైవర్సు చేసే అధి కారం ఉంది.

వేణు—అయితే నువ్వు మళ్ళీ పెళ్ళి చేసుకుంటావా?

శార—నో! నాకు మగవా డంటే అసహ్యం పుట్టింది- మగ వాండ్లంతా రోగ్సు! చెప్పు? నీవు ఆ పిల్లను తీసి పెట్టుకుంటావా?

శంక—ఆ పిల్లబాధ ఈవిడకు పట్టుకుం దేమిటాగ్రి మధ్యని? పోనీ అబ్బాయీ! అట్లాగే అందూ!

వేణు—నా కేభార్యా అక్కర్లేదు. ఇప్పుడు దివాలాతీసి మళ్ళా మొదటిపెళ్ళాం పని కొచ్చిందని అందరూ దెప్పడానికా?

శంక—దెప్పే దేమిటి? మనఊళ్ళో ఆ బుచ్చన్న శాస్త్రుల్లు కొడుకూ, సుబ్బయ్యగారి నరిశింహాం రెండో పెళ్ళాన్ని విడిచిపెట్టి మొదటిపెళ్లాన్ని మళ్ళీ తెచ్చుకున్నారు కారూ!

ప్రకా—[ప్రవేశించి] వాళ్ళని లోపలికి రానీకుండా గేటు దగ్గర అడ్డుతున్నారు.

శార—నెక్ హిమ్ ఔట్ (Neck him out) వారిని లోనికి తీసుకు రండి! [ప్రకాశం వెళతాడు]

శార—[వేణుతో] నేను విజయనగరం పోయి ఆ పిల్లను చూసి వస్తిని. నీ సమాచార మంతా తెలిసింది. సూర్యం ఎవరు తెలియునా? నీ బ్రిదరిన్‌ల్లా! వా రందరు ఇక్కడికి వస్తున్నారు.

శంక—నేను చెప్పలేదూ అబ్బాయి!

వేణు—ఇతడే చేశా డీమాయంతాను. ఇన్నాళ్ళూ వస్తూ పోతూ ఉంటే నా కేమీ అనుమానం కలగ లేదు! ఎనిమిదేళ్లకిందట ఆ పెళ్ళిలో చూశానేమో ఏం జ్ఞాపకం! ఎంత ప్లాను వేశాడు!

[కామశాస్త్రీ, సీతమ్మ, రత్నం, ప్రకాశం ప్రవేశం; కామ శాస్త్రి ముందుకు వచ్చి అందరినీ పరకాయిస్తాడు. సీతమ్మ వెనక్కి నిల బడి బెతుకుగా ప్రక్కచూపులు చూస్తుంది. రత్నం, తల్లి వెనకాల నిల బడుతుంది. ప్రకాశం ఒకప్రక్కగా నిలబడతాడు. వేణు కంగారు పడతాడు.]

శారద—[రత్నంతో] అమ్మాణీ! ఇటు రా!

[రత్నం, శారద దగ్గరకు వెళ్లి తలవొంచుకొని నిలబడుతుంది]

శంక—ఏమిరా! అబ్బాయి! మరేమిటి? ఆవిడ అట్లా అంటూంది. పిల్లను చూశావా! శుభ్రంగా బొద్దుగా పెరిగింది.

వేణు—[రత్నం వేపు క్రీగంట చూచి] మాట ఇలా రండి [వేణు శంకర- పైకి వెళతారు]

సీత—ఒప్పుకున్నాడా అమ్మా?

శార—ఎవరికోసం! ఒప్పుకోక ఏమి చేస్తాడు! ఇద్దరూ మాట్లాడుకొని వస్తారు. సూర్యంగారూ! మీకు మనీ ఇస్తాను. ఈ దగ్గర షాపుకు పోయి ఒక వస్తువు కొని తెస్తారా?

[శారద, ప్రకాశం పైకి వెళతారు]

కామ—ప్రకాశిగాడు ఈవిడ వెనకాల తిరుగుతున్నా డేమిటే?

సీత—ఊరుకోండీ బాగుండదు. ఆవిడమనస్సూ అతనిమనస్సు తెలిసినవా రెవ్వరూ అలా అనుకోరు. అయినా మొగాళ్ల కిదో దుర్గుణం, ఊరికే అనుమానపడడం.

కామ—ఏమేవ్ ! నువ్వుకూడా ఆవిడలాగే ఇటుపైని నా మీదికి ఎదురు తిరుగుతా వేమిటి?

సీత—ఆ ఎదురు తిరుగుతే మహా ఊరుకునే మనుష్యులనీ- ఆవిడలాంటి మనిషుందా? సవితికోసం మొగుణ్ణి వదులుకొనే ఇల్లా లెవ ర్తుంది? [ప్రకాశం ఒక పొట్లం పట్టుకొని ప్రవేశిస్తాడు.]

కామ—అబ్బ! ను వ్వింటికి రావూ?

ప్రకా—రాయలసీమ వెళదా మనుకొంటున్నాను. అక్కడ ఘోరమయిన కరువుపుట్టింది.

కామ—ప్రాయశ్చిత్తం అక్కర లేదని మునసబుగారు సెల విచ్చారు.

ప్రకా—వారికి చాలా కృతజ్ఞుణ్ని.

కామ—[కంటతడితో ప్రకాశం గెడ్డం పట్టుకొని] ఏదో! పెద్ద వాణ్ని అనేశాను; మనస్సులో కోపం లేదుగద!

పత్రికా—మీ రన్నక్షణంలో కూడా నాకు కోపం లేదు. మీరు విచారించకండి.

కామ—అప్పుడు మన విజయనగరం కాలేజీలో స్కాలర్షి ఇస్తామంటే చదువుకోసం కాశీ వెళ్ళిపోయావు. నాలుగైదు సమ్మంధాలు కట్న మిచ్చి పిల్ల నిస్తామని వస్తే తేలగొట్టేశావు. నేనూ పెద్దవాణ్ణయి పోతున్నానా! ఇంటిపట్టున ఉండి పెళ్లిచేసికొని నాకు ఆసరాగా ఉండకపోతే ఎలాగ? నాకు పత్రిథమ కోపమని తెలుసుండీ!

పత్రికా—నేను రాయలసీమనుండి తిరిగివచ్చాక ఆలోచిద్దాం.

శార—[ప్రవేశించి] ఏమండీ వారు వచ్చినారా?

పత్రికా—ఇంకా ఆలోచన తెగలేదండి.

శార—రండి! ఈలోగా మాయిల్లు చూడండిమీ!

కామ—ఓ! ఇల్లేమిటి? దివ్యభవనం. కలియుగకైలాసం.

[అంతా వెళతారు. శంకరగావు, వేణు ప్రవేశం]

శంక—మరి నీకేమి ఆలోచించకబ్బాయ్!

వేణు—నేను ఏంతో సరదాపడ్డానో అంతా భంగమయింది. బి. యే వరకు చదువుకొన్న భార్యతో ఎంతో విలాసంగా జీవితం గడుపుదా మనుకొన్నాను.

శంక—నిజమే! చక్కా ఇంగ్లీషు మాట్లాడుతూంటూ జటా పటాలు వేసుకొని, సినిమాలకీ, నాటకాలకీ తిరుగుతూంటే జరిగినన్నాళ్లు సౌఖ్యంగానే ఉంటుంది. ఇంతకీ ఆవిడకి నీ మీద మోజు లేనిదే!

వేణు—ఏదీ పెళ్ళయి నెలరోజులయినా కాలేదు. క్రమంగా దోవకి రాకపోతుందా అని ధైర్యం.

శంక—మరి లాభం లేదు. నేను కనిపెట్టాను కానూ? ఇంతకీ మనస్థితి మారిపోయింది. నే నొక్క కానీ వంపలేను. నువ్వు పట్టుమని పదిరూపాయ లార్జించలేవు. పైగా మొదటిపెళ్ళి కాలేదని అబద్ధమాడి రిజిస్ట్రారుదగ్గర సంతకం చేశావా! అందుకు కైదులో పెట్టించకుండా ఆ పిల్ల నంగీకరించినంతమాత్రాన ఆవిడ విడిచిపెడతా ననడం గొప్ప

మే లనుకో! ఈపట్ల ఈవిడ చాలా మంచి మనిషే అని సంతోషించు. అంతకంటె నువ్విప్పుడు చేయదగిన దేదీ లేదు.

వేణు—ఇంక చెన్నపట్నం సరదాలకి సలాం పెట్టేయడమే!

శంక—ఏం చేస్తాం! ప్రాప్తం లేందే! వాళ్లంతా వస్తున్నారు. ఒప్పుకొన్నావని చెప్పేదా. చెప్పు మరి! నేను ఎంత దూరాలోచన మీాద చెపుతున్నానో తెలుసునా?

[శారద, ప్రకాశం, కామశాస్త్రి, సీతమ్మ, రత్నం, ప్రవేశం. శంకరరావు వేణుని తొందరపెడతాడు.]

వేణు—కానిండి మరి.

శార—ఏమండీ?

శంక—ఒప్పుకొన్నాడు.

శార—దటీజ్ రైట్ (That is right) నిండాసంతోషం [వేణుని రత్నాన్ని దగ్గరగా చేర్చి చేతులు కలిపి ప్రకాశం తెచ్చిన పొట్లంవిప్పి కర్పూరపు పేర్లు తీసి ఇద్దరికీ ఇచ్చి, ఒకరొకరికి వేయిస్తుంది.]

శంక—అబ్బాయి! మీా మామగారికీ అత్తగారికీ నమస్కారం చేయి.

[వేణు అత్తమామలకి నమస్కరిస్తాడు - వారు దీవిస్తారు. సీతమ్మ రత్నంచేత, శంకర, శారద, కామ, ప్రకా-లకు నమస్కారం చేయిస్తుంది.]

శంక—[కామశాస్త్రితో] గతంగతమే! పాతవేవీ మనస్సులో ఉంచుకోకూడదు. పొరపాటు నాదీ మావాడిదీ అని ఒప్పుకొంటున్నాం.

కామ—నువ్వూ అల్లుడూ ఈ పట్టున మాయింటికి రావాలి. నువ్వెంత చెయిర్మెనువయినా ఎంత ధనవంతుడి వయినా సమ్మంధం పట్ల సమానులమే!

సీత—[శారదతో] మీారుకూడా రారమ్మా! ఒక్కసారి మా యిల్లు పావనంచెయ్యరూ? ఈసుకృత మంతా మీాదే!

శార——ఈరోజు మీ రంతా ఇక్కడే ఉండండి. విందుచేస్తాను. వేణూ! నా రింగు నా కిచ్చివేయి ఇదిగో నీ రింగు. ఐయామ్ నో మోర్ యువర్ వైఫ్ (I am no more your wife).

వేణు——[రింగు ఇచ్చివేస్తూ] మంచి గుణపాఠం అయింది.

శార——ఇక ముందుకూడా నిన్ను నా ఫ్రెండుగా ట్రీట్ చేసే దానికి అబ్జక్షన్ లేదు.

వేణు——థేంక్స్-

శంక——వియ్యం సమానమయినవారితో ఉండాలిగాని, ఆవిడ అప్సరసలాగ ఆకాశంమీదికి ఎగిరిపోతూంటే క్రిందినుండి మనం కొంగట్టుకొని వేలబడితేమాత్రం ఎంతదూరం వెళ్లగలం? డబ్బులెక్కేమిటి? చంచలాలక్ష్మి అన్నాడు డబ్బు మనతో వచ్చిందిగాని మనం డబ్బుతో రాలేదుకద!

ప్రకా——మామగారు బాగా చెప్పారు. ఆదర్శాలు అభిప్రాయాలూ వేరయినప్పుడు సమానదాంపత్యం కుదరదు. దానికి డబ్బుతోనూ విద్యోచదువుతోనూ సంబంధం లేదు. మానసిక వికాసం ప్రధానం- ఈ మహాకార్యం చేసి పుణ్యం కట్టుకొన్నందుకు శ్రీమతి శారదాంబగారికి అనేకవందనాలు. వారి ఆదర్శాలు- ఉత్కృష్టమైన దేశసేవా- అఖండమయిన త్యాగం——

శార——మరిలెక్చరువద్దు. నా డ్యూటీదా చేస్తిని.

[తెరలో రాయలసీమ క్షామనివారకదళంవారి పాట వినబడుతుంది.]

శార——ఎవ రండీ! అది!

ప్రకా——రాయలసీమక్షామనివారకదళంవారు.

శార——వారిని పిలువండీ!

[ప్రకాశం వెళ్లి వారిని పిలువగా వారు ప్రవేశించి ఒకచరణం పాడుతారు]

శార——[దళపతితో] ఈ ధన మంతా ఏమి చేస్తారు?

దళ—రాయలసీమలో కరువువల్ల నష్టపోయిన గ్రామాలకి పోయి, ఈ ధనం వారి కిచ్చి చేతనైనంత మానవసేవ చేదామని మా సంకల్పం.

శార—స్త్రీ లెవరూ లేరా ?

దళ—స్త్రీలదళం వేరే ఉంది. వా రింకొకవీధిలో చందాలు వసూలు చేస్తున్నారు.

శార—[మెడలోని హారము తీసి] ఇదిగో నాచందా! సూర్యం గారూ ! నే నా స్త్రీలదళంతో చేరి రాయలసీమ పోయేదానికి నిశ్చయించినాను. ఇట్లా ఆప్రాంతం వస్తున్నామని ఫాదరు కొక వైరియ్యండిమీ !

ప్రకా—అవశ్యం-

అందరూ.

[వందేమాతరం గీతం పాడుతారు.

వందే మాతరం! సుజలాం సుఫలాం మలయజ శీతలాం సస్యశ్యామలాం! మాతరం- వందే॥



## తెనుఁగు తల్లి
గ్రంథకర్త:- వేదాంతకవి.

విశ్వదాతని కని విశ్వ విఖ్యాతి సంపాదించిన మన తెనుగుతల్లి. తన చిన్నకొడుకుల అధోగతివల్ల దిక్కూ మొక్కూ లేక యేట్లోపడి కొండల్ని కరిగిస్తుంది. అఖండ విశ్వ కవితా సంస్థాన కవిచక్రవర్తిని చెట్టపట్టి కష్టాల్లోంచి గట్టున పడుతుంది. ప్రతివారూ చదివి తీరాలి. నాటకాన్ని చూచి తీరాలి.
వెల రు. 1-8-0

## కష్టకాలం
గ్రంథకర్త:- వేదాంతకవి.

భాగ్యవంతులచుట్టూ పహారాకాస్తున్న భజనపరులవల్ల యీ కష్టకాలం ప్రపంచానికి దిగింది. కొంపలు ముట్టించింది. నిజానికి నిల బడ్డవాళ్ళని ఖూనీచేస్తున్నది. కష్టకాలంలోవున్న అసహాయశూరులకు ఈ నాటకం వజ్రకవచం వంటిది.
వెల రు. 1-8-0.

## ముద్రిక
గ్రంథకర్త: పానుగంటి.

మొగుడికి ముండలమీంద మోజు, భాగ్యాని పాతివ్రత్యం అంటే ప్రాణం! చేతులో సిరిచిందు లేస్తోంది. ఆజ్ఞకు లోకం అవలిపోతోంది. క్షణక్షణపరివర్తన పొందే అతని భోగలాలసత్వంక్రింద యెన్ని తాళి బొట్లో తగలడిపోయినై, ఎన్ని సంసారాలో మన్నైపోయినై, తుద కాత నికి కామపిశాచానికి బలిగా ఒక సుక్షత్రియ కన్నె బలాత్కారంగా తేబడ్డది. ఆమెను మహారాణిగా చెయ్యాలని ఆ మహారాజు తొందర పడ్డాడు. అవన్ని చూసి చూసి, అతని భార్యలోవున్న సహానం కాస్త చచ్చిపోయింది. మెత్తమెత్తగా చెవిమెలేసే ఓ దాసీకన్నెను ఆమె చేరదీసింది. అక్కడనుంచి కథ ప్రారంభమైంది.

వలపు పల్కులలో, వలుకు కులుకులలో కలుకుములుకులలో ఆదాసి రాజుగారి వలపు చెలికాని లొంగించుకొని, బుగ్గపోట్లతో నాటకం అంతా నడిపింది. ముసిముసి నవ్వులతో రాజుగారి ముద్రికనపహరించి, ఆయన్ని బంధించి సార్వభౌముని కౌగిట్లో క్షత్రియకన్నె చిక్కకుండా విడిపించి రాణి కంటినుంచి రత్నాలు కురిపించింది. వెల రు. 1-0-0.

# సరస్వతీ బుక్ డిపో, బెజవాడ.

## చరిత్రాత్మక స్టేజీ నాటకములు

| ఒక్కొక్కటి ధర | | రూ. అ. |
|---|---|---|
| రసపుత్రవిజయము | ఇ. య. | 1-2 |
| రాణాప్రతాప్ సింగ్ | డిటో | 1-0 |
| చంద్రగుప్త | నం. శి. | 1-4 |
| ఖిల్జీ రాజ్యపతనము | గు. వేం. | 1-12 |
| దుర్గాదాసు | జం. శి. | 2-0 |
| రాణాప్రతాపసింహ | డిటో | 1-4 |
| బొబ్బిలియుద్ధము | శ్రీ. కృ. | 1-0 |
| [illegible] | వు. సు. | 1-0 |
| భక్తమీరాబాయి | కే. రా. | 1-2 |
| అనార్కలి | ఉ. స. | 0-12 |
| ఛత్రపతిశివాజి | డిటో | 1-0 |
| చండిక | ము. శే. | 1-8 |
| ధరణికోట | పో. రా. | 1-8 |
| ప్రతాపరుద్రీయము | డిటో | 1-8 |
| తాజమహల్ | డిటో | 1-8 |
| నా రోజా | భో. నా. | 1-0 |
| శంభాజీనిర్యాణం | శ్రీ. శా. | 1-0 |
| శివాజీ శీలము | డిటో | 1-0 |
| రోషనార | కొ. సు. | 1-0 |
| ఆంధ్ర వాణీసామ్రాజ్య మను శ్రీకృష్ణదేవ రాయలు | పో. సు. | 1-0 |
| మహారాష్ట్రవిజయం | చ.మా. | 1-0 |
| రంగరాయ కదన మను బొబ్బిలియుద్ధము | శా.సాం. | 0-12 |

## ఆంధ్ర నాటకములు

| ఒక్కొక్కటి ధర | | రూ. అ. |
|---|---|---|
| ప్రతాపాక్బరీయం | కో. శ్రీ. | 1-4 |
| చంద్రగిరాభ్యుదయం | డిటో | 1 4 |
| చిత్రనళీయము | ధ. కృ. | 1-12 |
| విషాదసారంగధర | డిటో | 1-12 |
| పాదుకాపట్టాభిషేకము | డిటో | 1-8 |
| చంద్రహాస | డిటో | 1-8 |
| ప్రమీలార్జునీయము | డిటో | 1-4 |
| ప్రహ్లాద | డిటో | 1-4 |
| మోహినీరుక్మాంగద | డిటో | 1-4 |
| సావిత్రి చిత్రాశ్వము | డిటో | 1-4 |
| బృహన్నల | డిటో | 1-4 |
| పాంచాలి స్వయంవరం | డిటో | 1-4 |
| ముక్తావళి | డిటో | 1-4 |
| చిరకారి | డిటో | 1-4 |
| పత్నీవ్రతాప్ అను అనసూయ | పో. అ. | 1-4 |
| పద్మవ్యూహము | శా. నా. | 1-4 |
| చిత్రాభ్యుదయ మను సారంగధర | శా. నా. | 1-0 |
| విద్యారణ్యుడు | దం. వేం | 0-8 |
| కిషోరి | సూ. పా. | 1-0 |
| శాకుంతల | కం. వీ. | 1-0 |
| బిల్వమంగళ | శ్రీ. శా. | 1-0 |
| లీలావతి సులోచనలు— | | 1-0 |
| మాధవాచార్య విద్యారణ్య | | 1-0 |

